# మీ పిల్లలకు విజ్ఞానం కలగాలంటే - చదివించండి...

# చిల్డ్రన్స్ నాలెడ్జ్ బ్యాంక్ Vol. I

బాలలు ఆలోచించనారంభించినప్పుడే వారిలో కుతూహలం పెరిగి తమ చుట్టూ ఉన్న సుందర ప్రపంచం గురించి "ఎందుకు ? ఏమిటి ? ఎలా ?" అన్న ప్రశ్నలు వారి మెదడును దొలిచివేస్తాయి. ఆ సమయంలో వారికి సమాధానం లభిస్తే వారికి ఉత్తేజం కలుగుతుంది. వారి మెదడు మరింత చురుకవుతుంది. దాంతో పిల్లలకు మానసికవికాసం కలుగుతుంది. ఆ మనోవికాసాన్ని కలిగించేదే—

చిల్డ్రన్స్ నాలెడ్జ్ బ్యాంక్ Vol. I

ఈ భాగంలో సుమారు 200 ప్రశ్నలు ఉన్నాయి. ఈ క్రింది భాషలలో కూడా లభ్యము—

ఇంగ్లీషు, హిందీ లలో Vol. I, II, III.




తమిళం, కన్నడం, బెంగాలీ, గుజరాతీ, మరాఠీలలో Vol. I
**Price same**




Vol. II in press

పెద్ద సైజు
232 పేజీలు
వెల : రూ. 20/-
తపాలా ఖర్చు 4/-

ఉదాహరణకు, ఈ మొదటి భాగంలో ఉన్న కొన్ని ప్రశ్నల జాబితా—

* దెయ్యాలున్నాయా ? * ప్లాస్టిక్ సర్జరీ అంటే ఏమిటి ? * స్త్రీలకు గెడ్డం ఎందుకు పెరగదు ? * నిజంగా రాక్షసాకారులు ఉన్నారా ? * మౌంట్ ఎవరెస్టుకు ఆ పేరు ఎలావచ్చింది ? * వ్యంగ్యచిత్రాలు ఎలా ప్రారంభమయ్యాయి ? * సరోవరాలు ఎలా ఏర్పడతాయి ? * సముద్రాలు ఎలా ఏర్పడ్డాయి ? * శనిగ్రహం చుట్టూ ఉన్న వలయాలు ఏమిటి ? * మనతో చంద్రుడు ఎందుకు పయనిస్తాడు ? * పిరమిడ్లు అంటే ఏమిటి ? * సూర్యగ్రహణం ఎలా ఏర్పడుతుంది ? * ఇంద్ర ధనుస్సు ఎలా ఏర్పడుతుంది ? * చైనాలోని పెద్ద గోడను ఎప్పుడు నిర్మించారు ? * సూర్యునిలోని వేడి ఎంత ? * పెన్సిలును ఎప్పుడు కనుగొన్నారు ? * భూమ్యాకర్షణశక్తి అంటే ఏమిటి ? * మృతసాగరం అంటే ఏమిటి ? * గ్లేసియర్స్ అంటే ఏమిటి ?

**From the makers of Rapidex English Speaking Course**

భారతదేశంలోని పెద్ద బుక్ స్టాల్స్‌లోను, ఎ.హెచ్. వీలర్స్, హిగిన్‌బాదమ్స్, రైల్వే బుక్‌స్టాల్స్‌లోను దొరుకుతుంది. లేక వి.పి.పి. కొరకు రాయండి—



**PUSTAK MAHAL**
**Khari Baoli, Delhi-110006**
* 10-B, Netaji Subhash Marg, New Delhi-110002

Postage FREE on any 2 Books

Vandana/PM/Tel-5



# చందమామ

## పాఠకులకు అభినందనలు!

మే నెల 'చందమామ'లోని అన్ని పేజీలూ పూర్తిరంగులలో ముద్రించడం జరిగింది. ఎంతో ఆకర్షణీయమయిన యీ మార్పును, పాఠకులు ఎంతవరకు గుర్తించగలరో వేచి చూడదలచి, ఆ విషయం సంపాదక పేజీలో రాయలేదు. అయినా, పాఠకులు యీ కొత్తదనాన్ని వెంటనే గుర్తించి, అభినందిస్తూ అసంఖ్యాకంగా ఉత్తరాలు రాశారు. ఇది 'చందమామ' పట్ల వారికున్న ఆసక్తినీ, ఆదరణనూ తెలియజేస్తుంది. వారికి మా అభినందనలు!

పత్రిక ప్రచురణకు అవసరం అయిన ముడివస్తువుల ధరలు యీ మధ్య కాలంలో దినదినానికీ విపరీతంగా పెరిగిపోతున్నవి. అలాంటి పరిస్థితుల్లో శ్రమకూ, వ్యయానికీ ఓర్చి బాలల వినోద, విజ్ఞానాలే ప్రధాన లక్ష్యంగా, 'చందమామ' ప్రచురణలో యీ అభివృద్ధిని సాధించాం. అంతేకాక ముందు, ముందు కథల, ప్రింటింగు స్థాయిలను మరింతగా అభివృద్ధి పరిచేందుకు కృషిచేయగలమని పాఠకులకు మనవిచేస్తున్నాం.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''ఇద్దరు కవులు''] కు ఆధారం ''వసుంధర'' రచన. దానధర్మాలు చేయడం, వివిధ తీర్థప్రదేశాలు తిరిగిరావడం అనేవి, మనిషి తనకు తాను ధర్మగుణం, భక్తిప్రపత్తులతో ఆచరించవలసిన కార్యాలు. అలా కాక, తనకు శత్రుభావం వున్నవాణ్ణి కించపరిచేందుకు, యిలాంటివి చేయడం అంటే ఎంత హాస్యాస్పదంగా వుంటుందో ''యాత్రాఫలం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

అర్థహాని శ్చావమతిః, గృహచ్ఛిద్రాదికం తథా,
వంచనా వంచనావాప్తి, ర్న ప్రకాశ్యాని సర్వదా.

[ధనం పోయినా, అవమానం కలిగినా, ఇంట కలత లేర్పడినా, తనవల్ల ఇతరులుగాని; ఇతరులవల్ల తనుగాని మోసపోయినా—నలుగురిలో చెప్పుకోకూడదు]

సంపుటి 72 జూన్ '83 సంచిక 6

విడి ప్రతి: 2–00 : : సంవత్సర చందా: 24-00





# అసలైన ఆభరణం

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాన, హఠాత్తుగా పెద్ద వర్షం ప్రారంభం కావడంతో, గంగాధరం వీధివాకిలి తలుపుతో పాటు కిటికీలు కూడా మూసి వచ్చాడు. గాలి హోరుకూ, ఉరుముల శబ్దానికీ అతడి ఆరేళ్ళ కూతురు విద్య భయపడిపోయి తల్లిని గట్టిగా చేర్చి పట్టుకుని కూర్చున్నది.

"భయపడకే, తల్లీ!" అంటూ గంగాధరం కూతుర్ని ఎత్తుకున్నాడు. అంతలో ఎవరో వీధి తలుపు తట్టిన శబ్దమైంది.

గంగాధరం వెళ్ళి తలుపు తీశాడు. వర్షంలో బాగా తడిసి ముద్దయిపోయిన అతడి మిత్రుడు సత్యంతోపాటు, మరొక మనిషి లోపలికి వచ్చాడు. సత్యాన్ని చూస్తూనే విద్య భయం పోయి చిన్నగా నవ్వింది. సత్యం, గంగాధరం చిన్ననాటి స్నేహితుడు. అతడికి పట్నంలో ఉద్యోగం.

గంగాధరం ఉత్సాహంగా భార్యను, "గాయత్రీ, యిదుగో మీ అన్నయ్య వచ్చాడు!" అంటూ కేక వేశాడు. వాళ్ళు తడిసి వుండడం చూసి గాయత్రి వాళ్ళకు పొడిబట్టలు తెచ్చి యిచ్చింది.

సత్యం బట్టలు మార్చుకుని, విద్యను తన చేతుల్లోకి తీసుకుంటూ, "పనిపడి రంగాపురం వెళుతున్నాను; దారిలో యీ వర్షం! అనుకోకుండా కోదండం కలిశాడు. మా పట్నం వాడే," అంటూ తనతో వచ్చిన మనిషిని గంగాధరానికి పరిచయం చేశాడు.

గాయత్రి అతిథులకు అప్పటికప్పుడు వేడివేడిగా వంట తయారు చేసింది. వాళ్ళు భోజనం చేయగానే, వీధిగదిలో యిద్దరికీ పడకలు సిద్ధం చేసింది.

"నేను, మామయ్య పక్కనే కథలు వింటూ పడుకుంటాను," అన్నది విద్య.

"ఇప్పటికే బాగా పొద్దుపోయింది. మామయ్య ప్రయాణ బడలికలో వున్నాడు. ఇప్పుడా కథలు!" అంటూ గాయత్రి కూతురును కసురుకున్నది.

"మరేం ఫర్వాలేదు, చెల్లీ! విద్యకు నిద్రపట్టేవరకూ కథలు చెబుతాను," అన్నాడు సత్యం.

విద్య సత్యం పక్కనే పడుకుని, అతడు చెప్పే కథలు వింటూ గంట తరవాత నిద్ర పోయింది. సత్యం కూడా బడలిక కొద్దీ, ఆ వెంటనే నిద్రపోయాడు. అతడికి తిరిగి మెలుకువ వచ్చేసరికి తెల్లవార వస్తున్నది.



అప్పటికే నిద్ర లేచి వున్న కోదండం, సత్యాన్ని, "నువ్వు మరి కొంతసేపు వుంటావా, నాతోపాటు బయలుదేరి వస్తావా?" అని అడిగాడు.

విద్య నిద్రలేస్తే, యిక ఆ పూటకు అక్కడి నుంచి తనను కదలనీయదని ఎరిగి వున్న సత్యం, గంగాధరం అతడి భార్యా భోజనంచేసి వెళ్ళమని బలవంతం చేసినా వినకుండా, కోదండంతోపాటు బయలుదేరాడు.

పొద్దెక్క నిద్రలేస్తూనే విద్య, "సత్యం మామయ్య ఏడీ?" అంటూ ఇల్లంతా వెతికి చూసింది.

గాయత్రి కూతుర్ని స్నానం చేయించడానికి పెరట్లోకి తీసుకుపోతూ, "మామయ్య నీకు బొమ్మలు తెస్తానని బజారుకు వెళ్ళాడు," అన్నది.

ఆమె కూతురుకు నీళ్ళు పోస్తూ బోసి మెడకేసి చూసి నిర్ఘాంతపోయింది. విద్య మెడలో అత్తగారు ఎంతో ప్రేమతో చేయించిన మూడు తులాల బంగారు గొలుసు లేదు! కిందటి సాయంత్రమే విద్య పేచీ పెడితే, పెట్టెలోంచి గొలుసు తీసి ఆమె మెడలో వేసింది.

గాయత్రి గబగబా ముందు గదిలోకి వచ్చి, విద్య పడుకున్న పక్క అంతా దులిపి చూసింది. గొలుసు జాడలేదు! గాయత్రికి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. అత్తగారు తన పెళ్ళినాటి గాజులు కరి



గించి, ఎంతో అపురూపంగా చేయించిన గొలుసు; అది పోయిందంటే ఆమె ఎంతగా బాధపడుతుంది! ఒక వారం రోజుల్లో, ముఖ్యంగా మనమరాలిని చూసేందుకు వస్తున్నట్టు ఉత్తరం కూడా రాసింది.

భార్య నుంచి గొలుసు కనిపించడం లేదని విని, గంగాధరం కూడా రెండు మూడుసార్లు ఇల్లంతా వెతికాడు. ప్రయోజనం కలగలేదు.

గాయత్రి దిగులు పడిపోతూ, "రాత్రికి రాత్రి గొలుసు మాయం కావడం విడ్డూరంగా వుంది. ఒకవేళ అన్నయ్య, నిద్రలో పిల్ల మెడకు గుచ్చుకుంటుందని, దాన్ని తీసి దాచాడేమో!" అన్నది.

గంగాధరాని కూడా. చివరికి యీ ఒక్క ఆశే మిగిలింది. రెండు రోజుల తరవాత తిరుగు ప్రయాణంలో, విద్య కోసం బొమ్మలు తీసుకుని సత్యం మళ్లీ వచ్చాడు.

గంగాధరం సత్యానికి జరిగింది చెప్పి, "గొలుసేమైనా నువ్వు తీసి దాచావేమో అనుకున్నాం," అన్నాడు.

సత్యం కొంచెంసేపు ఆలోచించి, "తప్పకుండా యీ పని ఆ కోదండం గాడిదే అయివుంటుంది!" అన్నాడు.

"అతనలాంటి వాడా?" అన్నాడు గంగాధరం ఆశ్చర్యపోతూ.

"అతడితో నాకు కొద్దిపాటి ముఖ పరిచయంతప్ప, అంతగా స్నేహమంటూ లేదు. నువ్వు, నాతో బయలుదేరు. అతడింటికి వెళ్ళి అడుగుదాం. అవసరం అయితే బెదిరించి చూద్దాం," అన్నాడు సత్యం.

ఇద్దరూ పట్నం చేరేసరికి మధ్యాహ్నం అయింది. భోజనం చేసి విశ్రాంతి తీసుకుని, సాయంత్రం కోదండం ఇంటికి వెళ్ళారు. ఆ సమయంలో కోదండం ఇంటి ముందున్న కూరపాదులకు నీళ్ళు పోస్తున్నాడు. అతడు సత్యం, గంగాధరాలను చూస్తూనే ఒకక్షణం నివ్వెరపడి, అంతలోనే సర్దుకుని, "రండి, రండి, అనుకోని అతిథులు!" అన్నాడు.

సత్యం అతడితో, "ఇక్కడి రక్షక భటుల అధికారి గంగాధరం పిన్నికొడుకు. గంగాధరం వాళ్ళింట్లో శుభకార్యానికి వచ్చాడు. నిన్ను చూస్తానంటే తీసుకు వచ్చాను," అన్నాడు.

కోదండం వాళ్ళను ముందు గదిలో కూర్చొబెట్టి, లోపలికి పోయి భార్యను, "అమ్మాయి ఎక్కడ ?" అని అడిగాడు.

ఆడుకోవడానికి వెళ్ళింది అని భార్య చెప్పగానే, కోదండం "నువ్వు వెంటనే పెరటిదోవన వెళ్ళి అమ్మాయి మెడలో వున్న గొలుసు తీసుకురా," అన్నాడు.



"అంత మునిగిపోయిందేమిటి ? అమ్మాయి చీకటి పడుతూనే తిరిగి వస్తుంది గదా," అన్నది భార్య.

"ముందు చెప్పినపని చెయ్యి," అంటూ కోదండం భార్యను కసురుకున్నాడు.

ఆమె పావు గంట గడిచీ గడవక ముందే, శోకాలు పెడుతూ తిరిగి వచ్చి, "కొంప మునిగింది! వీధిలో ఆడు కుంటున్న పిల్లలు చెప్పారు. ఎవడో పెద్ద గడ్డంవాడు మిఠాయి కొనిపెడతానని అమ్మాయిని తీసుకుపోయాడట. వాడు అమ్మాయి మెడలో వున్న గొలుసు దొంగి లించేందుకే అలాచేసివుంటాడు," అన్నది.

గొలుసు మాట వింటూనే కోదండం వెలవెలపోయి, భార్యను వారించ బోయాడు గాని, ఆమె దుఃఖంలో అది గమనించలేదు.

సత్యం కల్పించుకుని, "పిల్లలను వీధిలోకి మెడలో బంగారం గొలుసుతో పోనివ్వడం కోరి ప్రమాదం తెచ్చుకోవడమే! ఆ గొలుసు ఎలా వుంటుందో చెప్పి వెంటనే రక్షకభటులకు ఫిర్యాదు చేద్దాం," అన్నాడు.

ఈ ఫిర్యాదు మాట వింటూనే కోదండానికి వణుకు పుట్టింది. తను విద్య మెడ లోంచి గొలుసు దొంగిలించిన సంగతి ఎలాగూ బయట పడుతుంది. ఆ సంగతి రక్షకభటుల దగ్గిర తెలియడం అంటే, తనకు ఖైదు తప్పదు.

కోదండం యిలా ఆలోచించి, గంగాధరం చేతులు రెండూ పట్టుకుని వణుకుతున్న గొంతుతో, "మీరు నన్ను క్షమించాలి! మా అమ్మాయి మెడలోని గొలుసు మీ విద్యది, మొన్న రాత్రి దొంగిలించాను. మా ఆవిడ అమ్మాయికి గొలుసు చేయించమని రోజూ సాధిస్తూండేది. నాకా, ఆ స్తోమతులేదు. ఫిర్యాదు చేయకండి, పరువు నాకు ప్రాణంతో సమానం," అన్నాడు.

గంగాధరం ఎంతో సౌమ్యంగా, "చూడు కోదండం! పెళ్ళానికి నచ్చ చెప్పలేనప్పుడు, యిలాంటి అనర్థాలు జరుగుతుంటాయి. పిల్లలకు అసలైన ఆభరణం విద్య. అంతేకాని, చిన్నతనం నుంచీ వాళ్ళకు బంగారం మీద మోజు కలిగేలా చేయడం అవివేకం. ముందు మీ అమ్మాయి ఏమైందో వెదుకుదాం పద," అన్నాడు.

ఇంతలో మిఠాయి పొట్లంతో కోదండం కూతురు తిరిగివచ్చింది. ఆ పిల్ల మెడలో విద్య బంగారు గొలుసు కనబడగానే, కోదండం భార్య సంతోషంతో, "ఎక్కడికి వెళ్ళావే, తల్లీ? గడ్డంవాడెవడో నిన్ను ఎత్తుకు పోయాడనుకున్నాం," అన్నది.

కోదండం కూతురు మిఠాయి పొట్లం విప్పుతూ, "ఆ మామయ్య కొత్తగా యీ ఊరుకు ఉద్యోగం పని మీద వచ్చాడట. నేను అచ్చం వాళ్ళ అమ్మాయిలా వుంటానన్నాడు. కాసేపు నా మాటలు విని, మిఠాయి కొట్టు దగ్గిరకు తీసుకుపోయి, మిఠాయి కొనిపెట్టాడు," అన్నది.

కోదండం భార్య కూతురు మెడలోని గొలుసు తీసి గంగాధరానికిస్తూ, "నా మూర్ఖత్వం, ఆయన్ని దొంగగా చేస్తుందనుకోలేదు. పిల్లలకు బంగారం కాదు, బంగారంలాంటి భవిష్యత్తు కోసం విద్య ముఖ్యం అన్న సంగతి, మీ వల్ల తెలుసుకున్నాను," అన్నది.

గంగాధరం గొలుసును జేబులో వేసుకుని, కోదండం కూతురును ఆప్యాయంగా దగ్గిరకు తీసుకుంటూ, "దేవుడి దయవల్ల ఎవరి సొత్తు వారికి దక్కింది!" అన్నాడు.






## 2

[అవంతీనగరంలో ముగ్గురు అన్నదమ్ములుండేవారు. చిన్నవాడైన పింగళుడు చేపలు పట్టేందుకు చిలకసరస్సుకు వెళ్ళాడు. అక్కడికి మండనుడు అన్నవాడొకడు వచ్చి, తనను సరస్సులో కట్టిపడవేయవలసిందిగా కోరాడు. పింగళుడు అలాగే చేసి, పట్టణానికి వెళ్ళి కాంచనమిశ్రుడు అనే వర్తకుడి దగ్గిర నూరు మొహరీలు పుచ్చుకున్నాడు. తరవాత—]

కాంచనమిశ్రు డిచ్చిన నూరు మొహరీలు తీసుకుని, పరమానందంతో పింగళుడు దుకాణంవాడి దగ్గిరకు వెళ్ళాడు. దుకాణంవాడు, పింగళుడు ఉత్సాహంగా వున్నట్టు గ్రహించి, "పింగళా, ఇవ్వాళ అదృష్టం తిరిగినట్టుంది! చాలా చేపలు పట్టినట్టున్నావే?" అన్నాడు.

పింగళుడికి అప్పటి ఉత్సాహంలో తను నూరు మొహరీలు ఏ విధంగా సంపాదించిందీ దుకాణంవాడితో చెప్పాలనిపించింది. కాని, వెంటనే అతడికి కాంచనమిశ్రుడు చేసిన హెచ్చరిక గుర్తుకు వచ్చి, "పది రోజుల తరవాత, ఇవ్వాళే వలలో తిరిగి చేపలు పడినై. ఈ గడిచిన పది రోజులూ ఏదో దురదృష్టదేవత నన్ను వెన్నాడినట్టుంది." అన్నాడు విచారంగా.

తరవాత పింగళుడు, ఆ నాటివరకూ దుకాణంవాడికి యివ్వవలసిన డబ్బంతా




ఫింగళుడు జేబులోంచి మొహరీలు తీసి, తల్లికి చూపించాడు.

తల్లి మొహరీలు చూస్తూనే ఆశ్చర్య పడి, "ఇంత డబ్బు ఎలా సంపాయించావు ?" అని అడిగింది. పింగళుడు ఏమీ దాచకుండా జరిగినదంతా తల్లికి చెప్పాడు.

ఆమె అంతా విని, "పింగళా ! నువ్వు చేసిన పని మరెవరికైనా తెలిస్తే చాలా ప్రమాదం కలుగుతుంది. ఇక మీదట నువ్వు చిలకసరస్సు ప్రాంతాలకు వెళ్ళకు," అన్నది భయపడుతూ.

తల్లి భయం చూసి, పింగళుడు నవ్వి, "నేను చేసింది నేరం ఎలా అవుతుంది ? ఆ వచ్చినవాడు కావాలని కోరి చేతులు విరిచి కట్టించుకుని, సరస్సులో మునిగి చచ్చాడు. అయినా ఈ సంగతి మరెవరికీ తెలియకుండా దాయవచ్చు," అన్నాడు.

"నీ అన్నల సంగతి తెలునుగదా ? వాళ్ళు మంచివాళ్ళు కాదు. వాళ్ళ చెవిని పడకుండా ఉంచు," అన్నది తల్లి.

పది రోజుల తరవాత పింగళుడికి, ఆ రాత్రి హాయిగా నిద్రపట్టింది. అతడు మరునాడు తెల్లవారుతూనే వల తీసుకుని, చిలక సరస్సుకు వెళ్ళాడు. అతడు సరస్సులో మిట్టమధ్యాహ్నంవరకు వల వేసినా, ఒక్క చేప అయినా పడలేదు.

లెక్క చూసి ఇచ్చి, తనకు కావలసిన సామానులు తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

అతడు ఇంటికి వెళ్ళేసరికి అన్నలిద్దరూ గోడ నానుకుని, కునికిపాట్లు పడుతూ కనిపించారు. తల్లి ఎదురువచ్చింది. పింగళుడు తను దుకాణంనుంచి తెచ్చిన సామానులు తల్లికి ఇచ్చి, "ఇవ్వాళ అదృష్టం కలిసివచ్చింది. త్వరగా వంట పనులు పూర్తి చెయ్యి," అన్నాడు.

కొద్దిసేపటిలోనే తల్లి భోజనం తయారు చేసింది. పింగళుడితోపాటు జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా త్వరత్వరగా భోజనం చేసి, ఉల్లాసంగా బయటికి వెళ్ళిపోయారు. అన్నలు అటు వెళ్ళగానే

అతడు నిరుత్సాహపడి, ఇక ఇంటికి వెళదామా అనుకునేంతలో, అల్లంత దూరాన వేగంగా వస్తున్న గుర్రపు రౌతు కనిపించాడు.




పింగళుడు అదిరిపడ్డాడు. గుర్రం మీద వస్తున్న వ్యక్తి అచ్చుగా నిన్న వచ్చిన మండనుడి లాగానే ఉన్నాడు. సరస్సులో మునిగిపోయినవాడు పిశాచమై రావటం లేదుగదా? అనిపించింది పింగళుడికి. అంతలో గుర్రం అతణ్ణి సమీపించింది. రౌతు నవ్వుతూ గుర్రం మీంచి దిగి, "పింగళా, నీ నుంచి నాకో సహాయం కావాలి!' అన్నాడు.

పింగళుడు భయపడుతూనే అతడి కేసి చూశాడు. ఈ వచ్చినవాడు పోలికకు మాత్రం మండనుడి లాగానే ఉన్నాడు. కాని వయసులో మాత్రం అతడికన్న కొంచెం చిన్నవాడులా కనిపించాడు. గుర్రం కూడా మరో రంగుది. దానితో పింగళుడికి ఈ వచ్చింది పిశాచం కాదని తెలిసి, కొంత ధైర్యం కలిగింది.

"నా పేరు మీకెలా తెలుసు? నానుంచి మీకు కావలిసిన సహాయం ఏమిటి?" అని అడిగాడు పింగళుడు.

ఈ ప్రశ్న వింటూనే రౌతు పెద్దగా నవ్వి, "పింగళా! నీ పేరు నాకెలా తెలుసో, నే వచ్చిన పనేమిటో నీకు తెలియంది కాదు. నా పేరు అనురూపుడు. నీ సహాయం కోరిన మండనుడు నా సోదరుడే. నాకూ నీ నుంచి అలాంటి సహాయమే కావాలి," అన్నాడు.

"మండనుడు మీ సోదరుడా? ఆయన ఎక్కడున్నాడు?" అని అడిగాడు పింగళుడు.

అనురూపుడు పొట్ట చెక్కలయ్యేలా నవ్వి, సరస్సు మధ్యకు చేయి చూపుతూ, "బహుశా, మండనుడు అక్కడ వుండి వుంటాడు. లేక జలచరాలకు ఆహారమయినా అయివుండొచ్చు," అన్నాడు.

"అయితే, నిన్న ఇక్కడ జరిగిందేమిటో అంతా మీకు తెలుసునన్న




మాట ?'' అని ప్రశ్నించాడు పింగళుడు ఆశ్చర్యంగా.

"అవును. సర్వం నాకు తెలుసు. నీ నుంచి నాకూడా సహాయం కావాలి,'' అన్నాడు అనురూపుడు.

"చేస్తాను. కాని, నా సహాయానికి యీసారి రెండు వందల మొహరీలు ఇవ్వవలసి వుంటుంది,'' అన్నాడు పింగళుడు.

అనురూపుడు పెద్దగా నవ్వి, పింగళుడి భుజం తడుతూ, "అవును, నువ్వు రెండు వందల మొహరీలు అడుగుతావేమోనని నాకు ముందే అనుమానం కలిగింది. అందుకే కాంచనమిశ్రుడి దగ్గిర ఆ ఏర్పాటు చేసి వొచ్చాను. కాని నేను సరస్సు నుంచి ప్రాణాలతో బయట పడనని నీకెందుకు నమ్మకం కలగాలి?'' అన్నాడు.

తరవాత పింగళుడు తాడు తీసుకుని అనురూపుడి చేతులు వెనక్కు విరిచి కట్టి, అతణ్ణి భుజాన వేసుకుని సరస్సు ఒడ్డు మీదినుంచి లోపలకు విసిరివేశాడు. అనురూపుడు సరస్సులో పడబోయే ముందు, "పింగళా, నా తల ముందు నీటి మీద తేలితే, వెంటనే వలవేసి బయటికి లాగుసుమా!'' అంటూ కేకవేశాడు.

పింగళుడు సరస్సు ఒడ్డునే వల తీసుకుని సిద్ధంగా వున్నాడు. సరస్సులో కొంచెంసేపు అలలు లేచి తగ్గిపోయినై. ఒకటి, రెండు నిమిషాల తరవాత నీటి మీద చిన్న బుడగలు లేచి, అనురూపుడి కాళ్ళు ముందుగా పైకి తేలినై.

"చచ్చిపోయాడు, పాపం!'' అనుకుని పింగళుడు అనురూపుడి గుర్రాన్ని ఎక్కి, వెనక్కు తిరిగి చూడకుండా పట్టణంలోకి వెళ్ళాడు.

కాంచనమిశ్రుడు అతణ్ణి అంత దూరాన చూస్తూనే, "దురాశ దుఃఖంచేటు!'' అంటూ బిగ్గరగా అరిచి, పింగళుడికి రెండు వందల మొహరీలు లెక్కపెట్టి ఇచ్చాడు.

''దురాశ ఎవరిది? నాదా? ఈ రెండు వందల మొహరీల కోసం, నేనెంత శ్రమ చేస్తున్నానో నీకు తెలుసా?'' అన్నాడు పింగళుడు, కాంచనమిశ్రుడితో.

ఆ మాటలకు కాంచనమిశ్రుడు అయిష్టంగా తల ఊపి, ''దురాశ నీది కాదు, ఆ చనిపోయినవాళ్ళది. నువ్వు చేస్తున్న పని ఏమిటో బయటపడితే, నీకు కలగబోయే ప్రమాదం ఊహించటం ఏమంత కష్టం కాదు. నీలోనూ దురాశ తల చూపుతున్నది. నిన్న వంద మొహరీలు, ఇవ్వాళ రెండు వందల మొహరీలు!'' అన్నాడు.



''రేపు మూడు వందల మొహరీలు! అంతకు తక్కువయితే, నేను ఎవరికీ చచ్చేందుకు సహాయం చెయ్యను,'' అంటూ పింగళుడు ఇంటికి బయలుదేరాడు.

ఆ రాత్రి పింగళుడు, తల్లికి తను తెచ్చిన రెండు వందల మొహరీలూ ఇచ్చాడు. తల్లి ఆ డబ్బు చూస్తూనే భయంతో వణికిపోయింది. ''నాయనా! ఇకనైనా నువ్వు ఆ చిలకసరస్సు వైపుకు వెళ్ళటం మాను. నా కెందుకనో భయంగా వుంది,'' అన్నది.

''భయం ఏమీలేదు. నువ్వు ఈ సంగతి మాత్రం ఎవరికీ తెలియకుండా ఉంచు,'' అన్నాడు పింగళుడు.

ఆ రాత్రి పింగళుడికి సరిగా నిద్రపట్టలేదు. తెలతెలవారుతూండగానే వల భుజాన వేసుకుని చిలక సరస్సుకు వెళ్ళాడు. అతడు సరస్సులో వలవేసినా దృష్టిమాత్రం మైదానం మీదే ఉంది.

సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు మైదానం మీద దుమ్ము రేపుతూ ఒక రౌతు రావటం పింగళుడికి కనిపించింది. అతడు చూస్తూన్నంతలో రౌతు అక్కడికి వచ్చి, ''పింగళా! నా పేరు పద్మపాదుడు. నాకో సహాయం చేసిపెట్టాలి!'' అన్నాడు.

''ఓ, సహాయానికేం, చేస్తాను. ఈ సరస్సులో పడి ఆత్మహత్య చేసుకోవాలను

కున్న ప్రతి ఒక్కరికీ సహాయ పడటమే నాపని. మూడువందల మొహరీలు ఇవ్వవలసివుంటుంది,'' అన్నాడు పింగళుడు.

"దానికేం, నేను చచ్చిపోతే మూడు వందల మొహరీలు కాంచనమిశ్రుడు ఇస్తాడు,'' అంటూ పద్మపాదుడు నవ్వి, గుర్రానికి వేలాడుతున్న తాడు విప్పి పింగళుడి చేతికి అందించాడు.

పింగళుడు తాడు తీసుకుని పద్మపాదుడి చేతులు వెనక్కు విరిచికట్టి, అతణ్ణి భుజాన వేసుకుని, సరస్సు ఒడ్డుకు మోసుకుపోయి, లోపలకు విసిరి వేస్తూనే, "పాపం, చచ్చిపోయాడు!'' అంటూ వెనుదిరిగి గుర్రం దగ్గరకు వెళ్ళాడు.

పింగళుడు సరస్సు కేసి చూడనైనా చూడకుండా గుర్రాన్ని ఎక్కి బయలుదేరపోయేంతలో సరస్సులోనుంచి పద్మపాదుడి కేకలు వినిపించినై, "పింగళా, నన్ను త్వరగా వలవేసి బయటికి లాగు. నీకు పుణ్యం ఉంటుంది!'' అంటూ అతడు బిగ్గరగా అరవసాగాడు.

పింగళుడు గుర్రంమీంచి ఒక్క దూకు దూకి, వలవేసి, పద్మపాదుణ్ణి నీటిలోంచి ఒడ్డుకు లాగాడు. పద్మపాదుడు రొప్పుతూ నీటిలోంచి బయటికి వచ్చాడు. అతడి చేతిలో రెండు మొసలిపిల్లలు వున్నాయి.

పింగళుడు వాటికేసి ఆశ్చర్యంగా చూసి, ప్రశ్నించబోయేంతలో పద్మ



పాదుడు గుర్రం దగ్గిరకు వెళ్ళి, దాని మీద ఉన్న సంచీలోంచి ఒక గాజుజాడీ తీసి, దానిలో మొసలి పిల్లలను పడవేసి మూత పెట్టాడు.

పింగళుడు పద్మపాదుడి కేసీ, ఆ మొసలి పిల్లలకేసీ ఓమారు అనుమానంగా చూసి, "పద్మపాదా, నువ్వు చాలా అదృష్టవంతుడివి, బ్రతికి బయటపడ్డావు. సరే, నా మూడు వందల మొహరీల మాటేమిటి?" అన్నాడు.

పద్మపాదుడు పింగళుడిని కౌగలించుకుని, "పింగళా! నీకు ఆ మూడు వందల మొహరీలేమిటి....లక్ష...కోటి మొహరీలు ఇస్తాను. ప్రపంచంలో అందరికన్న ధనవంతుణ్ణి చేస్తాను. నువ్వు మాత్రం నా వెంట భల్లూకపర్వతాల దగ్గిరకు రావలసి వుంటుంది." అన్నాడు.

"భల్లూక పర్వతాలా? అబ్బో, ఆ పేరంటేనే నాకు భయం. మా అమ్మవాటిని గురించి చాలా సంగతులు చెప్పింది. ఆ కొండలు పిశాచాలకు నిలయమని విన్నాను." అన్నాడు పింగళుడు.

"పిశాచాలూ, దయ్యాలూ నిన్నేమీ చెయ్యలేవు. ఈ ప్రపంచంలో ముగ్గురే ముగ్గురు గొప్ప మాంత్రికులున్నారు. వాళ్ళల్లో ఇద్దరిని స్వయంగా నువ్వే ఈ సరస్సుకు బలి యిచ్చావు. ఇక మిగిలిన వాడిని నేను." అన్నాడు పద్మపాదుడు.

"నాకేమీ అర్థం కాలేదు." అన్నాడు పింగళుడు ఆశ్చర్యంగా.



"అలా అయితే, నీ సహాయం కావల సినవాణ్ణి గనక అంతా చెపుతాను, విను," అంటూ పద్మపాదుడు యిలా చెప్పాడు:

మేం ముగ్గురం అన్నదమ్ములం. మా తండ్రి గొప్ప మాంత్రికుడు. ఆయన తన మంత్రశక్తి వల్ల అనేకులకు మేలూ, కొందరికి కీడూ కూడా చేశాడు. ఆయన చిన్నప్పటి నుంచీ మా అన్నదమ్ముల్లో ఎవరి మీదా పక్షపాతం చూపకుండా, అందరికీ మంత్రవిద్యలో ప్రవేశం కల్పించాడు. ఆయన పెద్దవాడయి మరణించే ముందు ఆస్తిపాస్తులన్నీ మాకు సమానంగా పంచి యిచ్చాడు. కాని ఆయన తనకు తెలిసిన మంత్రవిద్యనంతా రాసి వుంచిన పుస్తకాన్ని మాత్రం మా కెవరికీ ఇవ్వకుండా, "మీలో ఎవరు శక్తిమంతులైతే, వారికి అది లభిస్తుంది!" అని చెప్పి మరణించాడు.

ఆయన మరణించిన మరుక్షణం నుంచీ మా అన్నదమ్ముల్లో కలతలు బయలుదేరినై. మాలో ప్రతి ఒక్కరికీ ఆ పుస్తకాన్ని తమదిగా చేసుకోవాలనే కోర్కె పుట్టింది. ఒకరి మీద ఒకరం, మంత్రశక్తి ఉపయోగించుకోవటానికి తయారయ్యాం.

అన్నదమ్ములం ఒకర్ని ఒకరం నాశనం చేసుకునేటందుకు సిద్ధమౌతున్న దశలో మా తండ్రికి మంత్రవిద్య నేర్పిన గురువు మా యింటికి వచ్చాడు. అతడు మా పోట్లాట చూసి, చాలా ఖేదపడ్డాడు. ముగ్గుర్నీ ఒకచోట కూర్చోపెట్టి, "మీ తండ్రి విడిచిపోయిన ఆ పుస్తకాన్ని గురించి, మీకేమీ తెలియదు. అందుకే తగవులాడుకుంటున్నారు. మీలో ఎవరు శక్తిమంతులైతే, వారికి ఆ పుస్తకం లభిస్తుందని మీ తండ్రి చెప్పాడు గదా? కనుక, ఆ పుస్తకంలో వున్న మంత్రశక్తులు మీ అధీనం కావాలంటే, ముందుగా మీరు సాధించవలసింది చాలా వుంది!" అన్నాడు. అదేమిటో చెప్పమని ఆయన్ని కోరాం. ఆయన యిలా చెప్పాడు:

—(ఇంకా వుంది)






# ఇద్దరు కవులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలా, చేబట్టిన కార్యం సాధించి తీరాలనే దృఢసంకల్పం మెచ్చదగిందే. నీ సంగతి తెలియదుగాని, చాలామంది రాజులకు, రాజ్యపాలన పట్ల వున్న ఆసక్తి, కవిత్వం తదితర కళల పట్ల వుండదు. అయినా, తాము గొప్ప కవి పండిత పోషకులం అన్న కీర్తి సంపాయించాలని, అలాంటి వారికి ఆస్థానంలో స్థానం కల్పిస్తూంటారు. ఆ కారణం వల్ల, ఒక్కొక్కసారి అనర్హుడైన కవి కూడా సన్మానం పొందటం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణగా నీకు, జయవర్మ అనే రాజు కథ చెబుతాను, శ్రమ

## బేతాళ కథలు



ఏమీలేదు. మనదేశంలో నాగేశ్వరుడు, గంగాధరుడు అనే ఇద్దరు మహా కవులున్నారు. వారు రాజాశ్రయం కోసం కాక, తమ తృప్తికోసం కవిత్వం రాస్తారు. వారిరువురి కావ్యాలలోని పద్యాలను సంగ్రహించి, నేనీ హరికథను కూర్చాను. గొప్పతనం వారిదే కాని, నాది కాదు," అన్నాడు.

జయవర్మకు వెంటనే, ఆ మహాకవులిద్దరినీ తన ఆస్థానానికి రప్పించాలన్న కోరిక కలిగింది. ఆయన వాళ్ళ కోసం రెండు మేనాలనూ, కొంత పరివారాన్నీ పంపాడు. కొద్దిరోజుల్లో ఇద్దరు కవులూ రాజధానికి తరలి వచ్చారు. జయవర్మ వారిరువురికీ వేర్వేరుగా విడుదులు ఏర్పాటు చేశాడు. తనే స్వయంగా వారిని సందర్శించి వారి కవిత్వం విన్నాడు. నిజంగా వారి కావ్యాలు గొప్పగా వున్నవి. ప్రతి పద్యంలోనూ అపూర్వమైన భావాలు ద్యోతకమవుతున్నవి; శబ్దాల కూర్పులో సంగీతధ్వనులున్నవి. అయితే రాజుకు ఒక అనుమానం వచ్చింది. నాగేశ్వరుడూ, గంగాధరుడూ—ఇరువురూ గొప్ప కవిత్వం చెప్పారు. కాని, ఇరువురిలో ఎవరి కవిత్వం గొప్పది ?

రాజు తన సందేహం గురించి ఆస్థాన కవులకూ, పండితులకూ చెప్పి, కావ్యా

తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

మాళవ దేశాన్నేలే రాజు జయవర్మ సభామంటపంలో నిత్యం ఏదో ఒక సాంస్కృతిక కార్యక్రమం జరుగుతూండేది. ఒకసారి హరిదాసొకడు తన కథనచాతుర్యంతో సభికులందర్నీ మంత్రముగ్ధుల్ని చేశాడు.

జయవర్మ హరిదాసును ఘనంగా సత్కరించి, "మీరు, మా ఆస్థానంలో వుండి పోరాదా! మీవంటి గొప్ప కథకుల్ని, నేనింతవరకూ చూడలేదు," అన్నాడు.

అందుకు హరిదాసు వినయంగా, "ప్రభూ, ఇందులో నా గొప్పతనం



లను వారు చదివినతరవాత, తన సందేహం తీర్చమన్నాడు.

మర్నాడు కవి పండితులందరూ ఏక కంఠంతో, "ప్రభూ, ఈ కావ్యపఠనం మాకు అదొక విధమైన పరవశత్వాన్ని కలిగిస్తున్నది. ఇవి అద్భుతమైన కావ్యాలు! వీటిని చదివి ఆనందించడమే తప్ప, ఏది గొప్పదో నిర్ణయించే శక్తి, మాకు లేదు మన్నించండి!" అన్నారు.

పండితుల జవాబుతో రాజుకు పట్టుదల ఎక్కువయింది. ఆయన మంత్రిని పిలిచి, "నా కోరిక తీరేమార్గం లేదా? నాగేశ్వరుడూ, గంగాధరుడూ రాసిన కావ్యాలను అర్థం చేసుకుని, వాటి గొప్పతనాన్ని అంచనా కట్టగలవాళ్ళు మన దేశంలో లేరా?" అని అడిగాడు.

మంత్రి ఆలోచించి, "ప్రభూ, యీ కవులు సామాన్యులుకారు. ఇలాంటివారు ఏ దేశంలోనైనా అరుదుగానే వుంటారు. అందువల్ల, వారి శక్తిని అంచనా కట్టడం, వారికే సాధ్యపడుతుంది," అన్నాడు.

జయవర్మకు యీ సూచన నచ్చింది. ఆయన గంగాధరుడు రాసిన ఒక కావ్యాన్ని తీసుకుని నాగేశ్వరుడి వద్దకు వెళ్ళాడు. ఆయనకు, తనను పీడిస్తున్న సందేహం గురించి వివరించి, "తమరీ కావ్యాన్ని పరిశీలించి, నిష్పాక్షికంగా తమ అభిప్రాయం తెలియజేయండి. ఈదేశం మొత్తం మీద, ఈ విషయంలో తీర్పునివ్వగలిగిన శక్తి, మీకు మాత్రమే వున్నది," అన్నాడు.

నాగేశ్వరుడు కావ్యాన్ని పరిశీలించి, "ప్రభూ, నిస్సందేహంగా యిది చాలా గొప్ప కావ్యం. గంగాధరుడు నా కంటే గొప్ప కవి," అన్నాడు.

జయవర్మ యీ తీర్పుకు ఆశ్చర్యపోయాడు. తరవాత ఆయన నాగేశ్వరుడి కావ్యాన్ని గంగాధరుడి వద్దకు తీసుకుపోయి, జరిగింది చెప్పి, "నాగేశ్వరుడే స్వయంగా అంగీకరించినప్పుడు, మీరే గొప్ప కవి అని నాకూ అనిపించింది. అయినప్పటికీ, యీ కావ్యం చూసి

నాగేశ్వరుడిని గురించిన మీ అభిప్రాయం చెప్ప కోరతాను,'' అన్నాడు.

గంగాధరుడు కావ్యాన్ని పరిశీలించి, ''మహాప్రభూ, ఇది చాలా గొప్ప కావ్యం. నాగేశ్వరుడే నాకన్న గొప్పకవి,'' అన్నాడు.

జయవర్మకు ఏం చేయాలో తోచలేదు. ఆయన మంత్రికి జరిగిందంతా చెప్పి, ''వీళ్ళ గొప్పతనాన్ని తేల్చడం, మనవల్ల కాదనుకుంటాను!'' అన్నాడు.

మంత్రి కొద్దిసేపు ఆలోచించి, "ప్రభూ, కవిత్వంలోనే కాక, వినయగుణంలో కూడా వీరు ఒకరికొకరు తీసిపోనట్టున్నారు. వీరి నుంచి నిజం బయట పెట్టించడానికి, ఒక చిన్న పథకం వేయాలి. కావ్యకర్త పేరు చెప్పడంవల్ల, వారు కావ్యంపై తమ నిజాభిప్రాయం చెప్పడం లేదు. తన గొప్పతనాన్ని, తానే చెప్పుకోకపోవడం ఉత్తమకవి లక్షణం గదా!'' అన్నాడు.

మంత్రి సూచన రాజుకు అర్థమైంది. అప్పుడాయన నాగేశ్వరుడు రాసిన మరొక కావ్యం తీసుకుని గంగాధరుడి వద్దకు వెళ్ళి, ''కవివర్యా! నా ఆస్థానంలో సుపద్ముడనే భటుడున్నాడు. ఆస్థానంలో నిత్యం కవిత్వం వింటూండడం వల్ల, వాడికి సాహిత్యాభిలాష కలిగి, తనూ ఒక కావ్యం రాశాడు. ఇది వాడి తొలి కావ్యం; నాకైతే నచ్చలేదు. కానీ, సాహిత్యంలో తప్పొప్పు లెంచడానికి నేనెంత వాణ్ణి! ఈ కావ్యంపై, తమ అభిప్రాయం చెబుతారని వచ్చాను,'' అన్నాడు.



గంగాధరుడా కావ్యం పరిశీలించి, "ఈ రచన చాలా ప్రాథమిక స్థాయిలో వున్నది. ఇతను కవి కావాలనుకుంటే, శ్రమపడి ఎంతో కృషి చేయవలసి వుంటుంది," అన్నాడు.

తర్వాత రాజు గంగాధరుడి కావ్యాన్నొకదాన్ని తీసుకుని, నాగేశ్వరుడి వద్దకు వెళ్లి, అది భటుడు సుపద్మ్నుడిదని చెప్పాడు.

నాగేశ్వరుడు కావ్యాన్ని పరిశీలించి, "ప్రభూ, యిది ఒక మహాకవి కావ్యం వలె వున్నది. శబ్దప్రయోగంలో సంగీతం పలుకుతున్నది; పద్యాలన్నింటా అద్భుత భావజాలమున్నది. ఒక్క మాటలో— మీ భటుడి నోట సరస్వతి పలుకుతున్నది!" అన్నాడు.

ఈ మాటలకు రాజు సంతోషించి, తన మందిరానికి పోయి, మంత్రిని పిలిపించి, "మనం గంగాధరుడిని ఘనంగా సన్మానించవలసి వున్నది. ఇరువురిలోనూ అతడే ఉత్తమకవి అని తేలిపోయింది!" అంటూ జరిగింది చెప్పాడు.

మంత్రి వెంటనే, "మహాప్రభూ, తమరు సన్మానించవలసింది నాగేశ్వరుణ్ణి; గంగాధరుణ్ణి కాదు!" అన్నాడు.

మంత్రి మాటలు వింటూనే రాజు జయవర్మ ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, తరవాత దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఇక్కడ నాకొక సందేహం కలుగుతున్నది. గంగాధరుణ్ణి సన్మానించాలనుకున్న రాజు



జయవర్మ, మంత్రి నాగేశ్వరుణ్ణి సన్మానించమనగానే, కోపగించుకోవలసింది పోయి, అలా దీర్ఘాలోచనలో పడడం ఎందుకు? కావ్యం ఎవరు రాసిందీ తెలియనప్పుడు, నాగేశ్వరుడి కావ్యం బాగాలేదని గంగాధరుడన్నాడు. కావ్యకర్త ఎవరో తెలియకపోయినా, నాగేశ్వరుడు గంగాధరుడి కావ్యం పరిశీలించి గొప్పదని చెప్పాడు. ఇదొక్కటే చాలు కదా, యిరువురిలో గంగాధరుడే గొప్పకవి అనేందుకు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నాగేశ్వరుడూ, గంగాధరుడూ ఒకరికొకరు తీసిపోని మహా కవులనేదాంట్లో సందేహం లేదు. ఇక వారిలో ఎవరో ఒకరిని మాత్రమే సన్మానించవలసి వచ్చినప్పుడు, కవులుగా కాక వ్యక్తులుగా వారి గుణగణాలను పరిశీలించవలసి వుంటుంది. ఆ ఇద్దరిలో గంగాధరుడు కడు అహంకారి. మొట్టమొదట రాజు నాగేశ్వరుడి వద్దకు వెళ్ళాడు. ఆయన గంగాధరుడే గొప్ప కవి అని చెప్పాడు. ఇకపోతే గంగాధరు డన్నట్టు నాగేశ్వరుడి కావ్యరచన ప్రాథమిక స్థాయిలో వున్నదంటే, ఏ కవి పండితుడూ అంగీకరించడు. ఆ కావ్యంలోని గొప్పతనాన్ని గంగాధరుడు గ్రహించలేకపోయాడు. రాజు, ఆ కావ్యం సుపద్ముడనే భటుడు రాసినదని చెప్పడం వల్ల, అతడు దాన్ని శ్రద్ధగా పరిశీలించి కూడా వుండడు. కొత్తగా ఘంటం పట్టిన కవిని, మహాకవి అయినవాడు తప్పక ప్రోత్సహించాలి. అలాంటి ఉదారగుణంగాని, ఉత్తమ సంస్కారంగాని గంగాధరుడిలో లేవు. ఈ కారణాలన్నింటివల్లా, మంత్రి చెప్పినట్టు, రాజు నాగేశ్వరుణ్ణి సన్మానించడమే ధర్మం అనిపించుకుంటుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# గడుసరి బేరం

చక్రధర పట్టణంలో చంద్రయ్య అనే దుకాణదారు వుండేవాడు. అతను పాత వస్తువులు కొనే, అమ్మే వ్యాపారంచేసేవాడు.

ఒక రోజు అతను బేరాల సందడిలో వుండగా, రామన్న అనే అతను ఒక ఉన్ని గొంగళిని చుట్టగా చుట్టి పట్టుకుని అతడి దగ్గిరకుపోయి, "కొత్త ఉన్ని గొంగళీ కొనాలంటే, ఏమాత్రం ఖరీదవుతుందో చెప్పగలరా?" అన్నాడు.

చంద్రయ్య, రామన్న కేసి విసుగుపడుతూ చూసి, "ఇది పాత వస్తువులు అమ్మే దుకాణం! కొత్తవాటి సంగతి మరొక చోట విచారించండి," అన్నాడు.

"ఇది పాత వస్తువుల దుకాణం అని నాకు తెలుసు. అయితే, అలాంటివాటికి ధర కట్టేప్పుడు, అవే కొత్తవయితే ఎంత ఖరీదవుతవో తెలుసుకోవాలిగదా," అన్నాడు రామన్న.

ఆ జవాబుకు చంద్రయ్య నవ్వుతూ, "నేను కొత్త వస్తువు వెలలో నాలుగో వంతుకు పాతది కొంటాను. దాని మీద రూపాయో, అర్ధో లాభం వేసుకుని అమ్ముతూంటాను. మాటవరసకు, మీ దగ్గిరున్న యీ పాత గొంగళి, కొత్తదయితే ఇరవై రూపాయిలు చేస్తుంది," అన్నాడు.

రామన్న "ఇంతకూ, యీ గొంగళికి ఐదారు రూపాయిలకన్న ఎక్కువ యివ్వనవసరంలేదంటారు!" అన్నాడు.

చంద్రయ్య గొంగళిని పరీక్షగా చూస్తూ, "దీనికి ఆ మాత్రం రావడం కూడా కష్టమే. రంగు కూడా వెలిసిపోయింది కనక, నాలుగు రూపాయలకు మించి చెయ్యదు," అన్నాడు.

"ఆఖరిసారిగా అడుగుతున్నాను. మరొక్కమాట చెప్పండి!" అన్నాడు రామన్న.

జొన్నలగడ్డ రత్న

చంద్రయ్య గొంగళిని తన చేతిలోకి తీసుకుని, "ఇది చాలా పాత గొంగళి. నేత కూడా బాగా నలిగిపోయి దారప్పోగులు బయటపడుతున్నవి. ఇది, మూడు రూపాయిల కన్న ఎక్కువ చెయ్యదు," అన్నాడు.

రామన్న జేబులోంచి మూడు రూపాయిలు తీసి, "బేరం మూడు రూపాయిలకు ఖాయం చేశారన్నమాట! సరే, యిక గొంగళిపట్టుకు పోతాను," అన్నాడు.

చంద్రయ్య రూపాయిల కేసి వింతగా చూస్తూ, "మీరు నాకు డబ్బిచ్చి గొంగళి పట్టుకుపోవడం ఏమిటి?" అన్నాడు.

"ఇది, మీ దుకాణంలోనిదేకదా! బయట వేళ్ళాడదీసివుండగా చూసి, నచ్చడంవల్ల, బేరమాడి కొనుక్కుపోదామని లోపలికి తీసుకువచ్చాను," అన్నాడు రామన్న.

చంద్రయ్య, రామన్న కేసి కోపంగా చూస్తూ, "ఈ గొంగళి మీద, దీని వెల ఎంతో రాసి అంటించిన చీటీ వుండాలి. అదేం చేశారు?" అని అడిగాడు.

"ఆ చీటీ వూడి కిందపడితే, జాగ్రత్తగా తీసి జేబులో వేసుకున్నాను," అంటూ రామన్న చీటీని చంద్రయ్య కిచ్చాడు.

చంద్రయ్య చీటీకేసి చూసి, "గొంగళి వెల పది రూపాయిలని స్పష్టంగా రాసి వుంది. ఇష్టమయితే ఆ ధర యిచ్చి పట్టుకెళ్ళండి," అన్నాడు.

"దీని వెల మూడు రూపాయిలకు మించదని, మీ నోటి మీదగా మీరే అన్న తరవాత, దీన్ని పది రూపాయిలు పెట్టి కొనే వెర్రివాడెవడైనా వుంటాడా?" అని రామన్న దుకాణంలో బేరాలు చేస్తున్న తతిమ్మావాళ్ళ కేసి చూశాడు.

వాళ్ళందరూ రామన్న చెప్పింది న్యాయంగా వున్నదన్నారు.

వస్తువు కొనడానికి వచ్చాడో, అమ్మడానికి వచ్చాడో తెలియనీయకుండా అంత చాకచక్యంగా బేరం సాగించిన రామన్నను, మనసులోనే మెచ్చుకుంటూ, చంద్రయ్య అతడికి మూడు రూపాయలకే గొంగళిని యిచ్చేశాడు.





# యాత్రాఫలం

గోపవరం గ్రామంలో రాఘవయ్య, భద్రయ్య అనే యిద్దరు భూస్వాములుండేవారు. ఏనాడో భూముల కొనుగోలు విషయంలో వచ్చిన చిన్న తగాదా, కొన్నాళ్ళకు వాళ్ళ మధ్య తీరని పగగా తయారయింది.

రాఘవయ్య అనుచరులు కొంతమంది, అతడిచ్చిన ప్రోద్బలంతో భద్రయ్య తరఫు వాళ్ళ మీద చీటికీ మాటికీ కయ్యానికి కాలు దువ్వేవాళ్ళు. భద్రయ్య కూడా రాఘవయ్యకు ఏ మాత్రం తీసిపోకుండా తన వాళ్ళను, వాళ్ళ మీదికి ఉసికొల్పుతూండేవాడు.

గ్రామంలోని యీ పరిస్థితి చూసి, దాపులనున్న ఏటిగట్టున కుటీరంలో వుండే సాధువుకు చాలా బాధ కలిగేది. ఆయన రాఘవయ్య, భద్రయ్యలను పిలిచి ఒకటికి రెండుసార్లు తగాదాలు మానవలసిందిగా హితబోధ చేశాడు. కాని, అందువల్ల ఎలాంటి ప్రయోజనం కలగలేదు.

ఒకసారి రాఘవయ్య పుణ్యతీర్థాలకు యాత్ర వెళ్ళి రావాలనుకుని, ఆ సంగతి చెప్పేందుకు సాధువును దర్శించి, "నేను మన ఊరివాళ్లు కొందరితో కలిసి రామేశ్వరానికి యాత్ర వెళుతున్నాను. తమరు శిష్యులతో సహా వెంట వస్తే, మాకెంతో ఆనందంగా వుంటుంది," అన్నాడు.

"నాకెందుకు యీ తీర్థయాత్రలు, మీరు వెళ్ళి రండి!" అన్నాడు సాధువు.

రాఘవయ్య ఎంతో వినయంగా, "ప్రయాణం ఖర్చుల గురించి మీరేం వెనకాడనవసరం లేదు. ఇంత కలవాణ్ణి. అవన్నీ నేను చూసుకుంటాను," అన్నాడు.

సాధువు చిరునవ్వు నవ్వి. "నీకు, నాపై వున్న భక్తి చూసి చాలా సంతోషం

రావులపాటి ప్రసాద్



రాఘవయ్య కిచ్చి, "నీతోపాటు దీన్ని అన్ని పుణ్యక్షేత్రాలకూ తీసుకుపోయి, నువ్వు స్నానం చేసే ప్రతి తీర్థంలోనూ ముంచి, భద్రంగా తిరిగితెచ్చి నా కివ్వు," అన్నాడు.

రాఘవయ్య ఆ మూట తీసుకుని వెళ్ళి పోయాడు. గంట తరవాత భద్రయ్య సాధువు దగ్గిరకు వచ్చాడు. సాధువు అతణ్ణి దక్షిణదేశ యాత్రకు వెళుతున్నావా అని అడిగాడు.

"దక్షిణాన ఆ రామేశ్వర యాత్ర చేసి రావడం, ఒక గొప్ప విశేషమా, స్వామీ! నేను మన ఊరి వాళ్ళతో కలిసి, ఉత్తర దేశానగల అన్ని పుణ్యక్షేత్రాలూ దర్శిస్తూ, హిమాలయాల వరకూ పోదలిచాను. ఈ యాత్రలో తమరూ, శిష్యులూ మా వెంట రావాలని ప్రార్థన," అన్నాడు భద్రయ్య వినయంగా.

"ఈ మాటే ఇంతకుముందు ఇక్కడికి వచ్చిన రాఘవయ్య కూడా అన్నాడు. కాని, ఇటువంటి తీర్థయాత్రల వల్ల గొప్పగా ప్రయోజనం వుంటుందని, నేననుకోను," అన్నాడు సాధువు.

ఈ జవాబుకు భద్రయ్య ముఖం చిన్నబుచ్చుకుని, "స్వామీ, ఆ ప్రయోజనం సంగతి తిరిగి వచ్చాక చూసుకోవచ్చు. రాఘవయ్య తన వాళ్ళతో యాత్రకు కలుగుతున్నది. కాని ఒకటి, కేవలం యిలాంటి తీర్థయాత్రల వల్ల పెద్ద ప్రయోజనం వుంటుందన్న నమ్మకం నాకు లేదు," అన్నాడు.

ఆ జవాబుకు రాఘవయ్య ఆశ్చర్యపోయి, "అన్నీ తెలిసిన మీరే యిలా అంటే, నేనేం చెప్పగలను! తీర్థయాత్రల వల్ల నిజంగానే ప్రయోజనం లేదంటారా?" అని అడిగాడు.

సాధువు ఒక క్షణం ఆగి, "ఆ సంగతి మీరు యాత్రల నుంచి తిరిగి వచ్చాక చెబుతాను. ఈ యాత్రల్లో నువ్వు నా కొక సాయం చేసి పెట్టాలి!" అని కుటీరంలోకి పోయి, ఒక చిన్న మూట తెచ్చి

పోతున్నాడు. మీరే చెప్పండి, నేను అతడి కన్న ఎందులో తక్కువ? నేను మరి కొంత భారీ యాత్ర చేయదలిచాను. మీరు మా వెంట వుండి, మమ్మల్ని ఆశీర్వదించాలి!'' అన్నాడు.

''ఇంత గౌరవపూర్వకంగా ఆహ్వానిస్తున్న నిన్ను, నిరాశపరచడం నాకు బాధగా వుంది. ఒక పని చెయ్యి. నా బదులు, నీకు తోడుగా వుండేందుకు ఒక మూట యిస్తాను,'' అని రాఘవయ్యకు యిచ్చినట్టే ఒక చిన్న మూట యిచ్చి, ఏం చేయవలసిందీ చెప్పాడు సాధువు.

రాఘవయ్యా, భద్రయ్యా యాత్రలు ముగించుకుని ఆరు నెలల తరవాత గ్రామం చేరి, సాధువు తమకు యిచ్చిన మూటలను ఆయనకు భద్రంగా అప్పగించారు.

ఆ మర్నాడు సాధువు వాళ్ళను ఆశీర్వదించడానికి తన కుటీరంలో విందు ఏర్పాటు చేశాడు.

విందులో రాఘవయ్య మనుషులు ఒక వరసలోనూ, భద్రయ్య మనుషులు మరొక వరసలోనూ ఎదురెదురుగా కూర్చున్నారు. సాధువు తన శిష్యులతో వడ్డన ప్రారంభించమని చెప్పాడు.

రాఘవయ్యా, భద్రయ్యలతో పాటు, వాళ్ళ అనుచరులు కూడా ప్రతి వంటకాన్నీ చాలా బాగున్నదని మెచ్చుకుంటూ తినసాగారు.



సాధువు వాళ్ళతో, ''నాయనలారా, తీర్థయాత్రలు చేసి వచ్చిన మీ కోసం, ప్రత్యేకంగా పాయసం ఒకటి చేయించాను. అది, యిప్పుడు మీరు తినే వాటి కన్నా కూడా అద్భుతంగా వుంటుంది,'' అని, శిష్యులకు ఆ పాయసం వడ్డించమని చెప్పాడు.

పాయసం రుచి చూస్తూనే అందరూ ముఖాలు చిట్లించి, సాధువుకేసి చూశారు. సాధువు వాళ్ళను, ''ఏం, పాయసం రుచిగా లేదా ?'' అని అడిగాడు

''రుచా! పరమ చేదుగా వుంది.'' అన్నారు అందరూ.

''అలాగా! కావడానికి అది కాకర కాయతో చేసిన పాయసమే. కాని, అది మీతోపాటు అన్ని పుణ్యక్షేత్రాలూ దర్శించి, ప్రతితీర్థంలోనూ స్నానమాడింది కదా ? ఆ కారణంవల్ల దాని చేదుపోయి, తియ్యదనం వచ్చిందనుకున్నాను,'' అన్నాడు సాధువు.

సాధువు మాటల్లో ఏదో గూఢార్థం వున్నదని గ్రహించిన అందరూ లేచి చేతులు కడుక్కుని, సెలవు పుచ్చుకునేందుకు ఆయన దగ్గరకు వచ్చారు.

సాధువు వాళ్ళతో, ''కాకరకాయ ఒట్టి జడపదార్థం. అందువల్లనే ఎంత పెద్ద యాత్ర చేసినా దాని గుణంలో చిన్న మెత్తు మార్పు కూడా రాలేదు. కాని, మనుషులమైన మనం అలా కాదు. అనుభవాల వల్ల ఎన్నో మంచి విషయాలు గ్రహించగలం. ఈ యాత్రలు మీలో మంచి మార్పు తెచ్చి వుంటుందని నమ్ముతున్నాను,'' అన్నాడు.

రాఘవయ్యా, భద్రయ్యా ఆ మాటలు వింటూనే చేయి, చేయి కలుపుకుని, సాధువు ముందుకు వచ్చి, ''స్వామీ, మీరు మా కళ్ళు తెరిపించారు. ఈనాటి నుంచీ మా మధ్య స్నేహానికి తప్ప, వైరానికి తావు లేదు. గ్రామస్థులందరం సోదరభావంతో కలిసి మెలిసి జీవిస్తాం,'' అన్నారు.

సాధువు వాళ్ళను దీవిస్తూ, ''అదే యాత్రాఫలం!'' అన్నాడు.





# మరుగుజ్జు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక బ్రాహ్మడికి కుమారుడుగా జన్మించాడు. అతను చాలా పొట్టివాడు కావటంచేత అందరూ అతన్ని మరుగుజ్జు అని పిలిచేవాళ్ళు. అతను చిన్నతనంలోనే తక్షశిలకు వెళ్ళి అక్కడ ఒక గురువు వద్ద విలువిద్య నేర్చుకుని, ఆ విద్యలో గొప్ప ప్రవీణుడయాడు.

ఆ తరవాత మరుగుజ్జుకు విలువిద్యతోనే పొట్టపోసుకోవాలన్న కోరిక కలిగింది. ఆ కారణంగా అతను చాలాదేశాలు తిరిగి, ఎందరో రాజులను సందర్శించి, తాను విలువిద్యా ప్రవీణుడినని చెప్పి, కొలువులోకి తీసుకోమని కోరాడు. కాని అతను పొట్టివాడు కావటం మూలాన ఎవరూ అతన్ని కొలువులోకి తీసుకోలేదు.

ఉద్యోగం సంపాదించటానికి ఏమి చెయ్యాలో, తన విద్యను ఏ విధంగా ఉపయోగపరుచుకోవాలో తెలియక, ఒక నాడు మరుగుజ్జు ఒక గ్రామంలోని సాలె వీధి గుండా పోతూ ఉండగా, అతనికి ఆజానుబాహు వొకడు మగ్గం మీద పని చేస్తూ కనిపించాడు. మరుగుజ్జు ఆ మనిషిని ''నీ పేరేమిటి?'' అని అడిగాడు.

''నా పేరు భీమసేనుడు,'' అని చెప్పాడు సాలెవాడు.

''ఇంత ఒడ్డూ పొడుగూ ఉన్నావు, ఇంత గొప్ప పేరు పెట్టుకున్నావు, సాలె పని చెయ్యటం కర్మమేం వచ్చింది నీకు?'' అని మరుగుజ్జు అడిగాడు.

''నేనేం చెయ్యను? బట్టలు నేయటం తప్ప నాకింకే పనీ చేతకాదు!'' అన్నాడు భీమసేనుడు.

''పుష్కలంగా సంపాదించుకునే ఉపాయం చెబుతాను, నా వెంట వస్తావా?'' అని మరుగుజ్జు అడిగాడు.



భీమసేనుడు సంతోషంగా ఒప్పుకుని మరుగుజ్జు వెంట బయలుదేరాడు. ఇద్దరూ కలిసి ప్రయాణం చేసి కొద్ది రోజులలో కాశీ రాజ్యం చేరారు.

"నీవు రాజుగారి వద్దకు వెళ్ళి, విలు విద్యలో గొప్పవాణ్ణని చెప్పుకుని, ఉద్యోగం అడుగు. నీ ఒడ్డూ పొడుగూ చూసి వెంటనే ఉద్యోగం ఇస్తారు," అని మరుగుజ్జు భీమసేనుడితో అన్నాడు.

"మరి నాకు విలువిద్య రాదే?" అన్నాడు భీమసేనుడు.

"నీకు రాకపోతే ఇబ్బంది లేదు. నాకా విద్య బాగా వచ్చు. నన్ను నీ భటుడిగా వేసుకో. అవసరమైనప్పుడల్లా నేను నీకు సహాయపడుతుంటాను," అని మరుగుజ్జు ధైర్యం చెప్పాడు.

ఆ ప్రకారమే భీమసేనుడు కాశీ రాజు వద్దకు వెళ్ళి, తాను గొప్ప విలుకాడినని చెప్పి, సులువుగా కొలువు సంపాదించాడు. అతని జీతం పక్షానికి వెయ్యి రూపాయలు. మరుగుజ్జు అతని కింద భటుడిగా చేరాడు.

ఇంతలో కాశీ నగరానికి సమీపాన గల అడవులలో ఉండే పెద్దపులి ఒకటి రహదారి కాసి దారేపొయ్యే మనుషులను చంపనారంభించింది. ఈ సంగతి తెలియగానే రాజుగారు భీమసేనుణ్ణి పిలిచి, ఫలానా చోట ఒక పెద్దపులి ఉండి దారే పోయేవారిని భయపెడుతున్నదనీ, ఆ పెద్దపులిని చంపిరమ్మని ఉత్తరువిచ్చాడు.

భీమసేనుడు అందుకు అంగీకరించి, మరుగుజ్జు వద్దకు వచ్చి, "ఇప్పుడు నాకి బెడద వచ్చి పడింది. నేను ఆ పెద్దపులిని ఎలా చంపగలను? ఈ గండం తప్పే ఉపాయం చెప్పు!" అన్నాడు.

"నేను చెప్పినట్టు విను. పులిని నువు ఒక్కడివే చంపలేవు. ఊరి బయటికి వెళ్ళగానే పల్లెటూళ్ళ జనాన్ని రెండు వేల మందిని పోగుచేసుకుని పులి వచ్చే చోటికి వెళ్ళు. పులి అరుపు వినగానే నువు ఏ పొదలోనన్నా దూరి దాక్కో. నీ వెంట వచ్చిన జనం పులిని చంపే

స్తారు. పులి చచ్చినదాకా దాగి ఉండి, ఆ తరవాత లత ఒకటి తెంచుకుని ఇవతలికి వచ్చెయ్యి. ఆ తరవాత పులి చచ్చిపోవటం చూసి కోపం తెచ్చుకో! ''దీనిని ఈ లతతో కట్టి రాజుగారి దగ్గరికి తీసుకుపోయి నా ప్రజ్ఞ చూపించుతామనుకున్నాను. దాన్ని చంపటానికైతే మీరంతా దేనికి? నేను చాలనా? ఈ పులిని చంపిన వాళ్ళెవరో చెప్పండి, వాళ్ళకి శిరశ్ఛేదం చేయిస్తాను!'' అని కేకలు పెట్టు. జనం దడుసుకుని, పులిని చంపింది మేము కాదంటే మేము కాదంటారు. అప్పుడు నువు తిరిగి వచ్చి రాజుగారితో పులిని నువ్వే చంపినట్టు చెప్పవచ్చు. నువ్వు చెప్పే మాట నిజం కాదనటానికి జనంలోని వారెవరూ సాహసించరు!'' అని మరుగుజ్జు ఉపాయం చెప్పాడు.



భీమసేనుడు అక్షరాలా మరుగుజ్జు చెప్పినట్టే చేశాడు. పెద్దపులిని గ్రామస్థులంతా కలిసి చంపుతుంటే భీమసేనుడు పొదల మధ్య దాగి ఉండి, అది చచ్చినాక ఒక లత చేతబట్టి బయటికి వచ్చి, తను అలా వెళ్ళిన సమయంలో పులిని చంపేసినందుకు గ్రామస్థుల మీద ఎగిరి పడ్డాడు. దాన్ని చంపిన వాళ్ళ తలఎగిరి పోతుందన్నాడు. గ్రామస్థులంతా భయపడి ఎవరి దారిన వారు జారుకున్నారు.

తరవాత భీమసేనుడు నగరానికి తిరిగి వెళ్ళి, రాజును దర్శించి, ''మహారాజా, తమ ఆజ్ఞప్రకారం పెద్దపులిని చంపేశాను. ఇక రహదారిన ప్రయాణం చేసే ప్రజలకు ఎట్టి భయమూలేదు!'' అని విన్నవించాడు.

రాజుగారు భీమసేనుడి పరాక్రమానికి చాలా సంతోషించాడు. భీమసేనుడి ఖ్యాతి రెట్టింపయింది. అందరూ అతన్ని ప్రశంసించే వాళ్ళే. ఈ ప్రశంసలు వింటూ భీమసేనుడు తాను నిజంగా మహావీరుణ్ణి అయిపోయాననుకుని, తనకు బంటుగా ఉన్న మరుగుజ్జును చిన్నచూపు చూడసాగాడు. ఇది, మరుగుజ్జు గ్రహించాడు గాని అంతగా పట్టించుకోలేదు.

ఇలా ఉండగా కాశీరాజ్యం మీదికి ఒక శత్రురాజు దండెత్తి వచ్చి, నగరాన్ని తన సైన్యాలతో చుట్టుముట్టి, "లొంగి పోతారా? లేక యుద్ధం చేస్తారా?" అని కబురు చేశాడు. రాజుగారు భీమసేనుణ్ణి పిలిచి, "అవసరమైన బలాలను తీసుకుని శత్రువును జయించి రా!" అని ఆజ్ఞాపించాడు. అతనికి కవచం తొడిగి, విల్లు బాణాలు చేతికిచ్చి, ఒక ఏనుగుపై ఎక్కించి యుద్ధ రంగానికి పంపారు.

భీమసేనుడికి ప్రమాదం జరగబోతుందని మరుగుజ్జుకు తెలుసు. తాను కూడా విల్లూ, బాణాలూ ధరించి భీమసేనుడి వెనకగా ఏనుగు మీద కూచున్నాడు. చుట్టూ అశ్వదళమూ, పదాతిదళమూ నడుస్తూండగా ఏనుగు యుద్ధభూమికి కదిలి వెళ్లింది.

శత్రుసేనలు బారులు తీర్చి ఎదురుగా నిలబడి ఉండటం చూడగానే భీమసేనుడికి దడపుట్టుకొచ్చింది. ముచ్చెమటలు పోశాయి. కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. అతను ఏనుగు మీది నుంచి కిందికి జారి తప్పించుకోవాలని చూశాడు. సమయానికి మరుగుజ్జు అతన్ని పట్టుకుని ఏనుగుకు కట్టివెయ్యక పోయినట్టయితే భీమసేనుడు గుర్రాల కాళ్ళ కింద నలిగి నిష్కారణంగా చచ్చిపోవలసిన వాడే!

ఇంత జరిగాక మరుగుజ్జు తానే నాయకత్వం తీసుకున్నాడు. అతను ఏనుగును అదిలించి సుడిగాలిలాగా శత్రుసేనల మధ్య జొరబడి, శత్రువులపై బాణాల వర్షం కురిపిస్తూ, సూటిగా శత్రురాజును సమీపించాడు. అతని ధాటికి శత్రుబలాలు చిందర వందర అయాయి. కొద్దిసేపట్లో శత్రురాజు గాయపడి, ఓడిపోయి, మరుగుజ్జుకు ఖైదీగా చిక్కాడు.

మరుగుజ్జు యుద్ధరంగం నుంచి విజయుడై తిరిగి రాగానే రాజుగారికి నిజమైన విలుకాడెవరో తెలిసిపోయింది. ఆయన మరుగుజ్జును సేనానాయకుడుగా నియమించాడు. మరుగుజ్జు భీమసేనుడికి అంతులేని కానుకలిచ్చి పంపేశాడు.





## అక్బర్ చక్రవర్తి – 1

హుమయూన్ మరణించినప్పుడు అతని కుమారుడు జలాలుద్దీన్ మహమ్మద్ అక్బర్, పంజాబులో వున్నాడు. అక్బర్‌కు పధ్నాలుగవ యేట మొగల్ సామ్రాజ్య పట్టాభిషేకం జరిగింది. హుమయూన్ మిత్రుడు బైరంఖాన్ అక్బర్ సంరక్షకుడయ్యాడు.

రాజ్యాధికారం చేపట్టిన వెంటనే అక్బర్ ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసివచ్చింది. షేర్షా వంశానికి చెందిన హేము అనే సేనానాయకుడు ఢిల్లీ, ఆగ్రాలను ఆక్రమించాడు. అక్బర్, హేము సేనల మధ్య పానిపట్టువద్ద యుద్ధం ప్రారంభమయింది. ఆ యుద్ధమే రెండవ పానిపట్టు యుద్ధంగా చరిత్ర ప్రసిద్ధిగాంచింది.





యుద్ధంలో మొదట హేము బలమైన సైన్యంధాటికి, ఎత్తుగడలకూ అక్బర్ సైన్యం తట్టుకోలేకపోయింది. అక్బర్ పరిస్థితి దాదాపు ఓడిపోయే స్థితికి వచ్చింది. అయినా అక్బర్ అదృష్టమా అన్నట్టు హేము, బాణం దెబ్బకు గురై, గుర్రం పైనుంచి కిందపడటం చూసిన అతని సైనికులు భయభ్రాంతులైపోయారు. ఆ కారణం వల్లనే అక్బర్ విజయం సాధించగలిగాడు.



హేమూను భటులు బంధించి తెచ్చి అక్బర్ ముందు నిలిపారు. శత్రు శేషం వుండకూడదు; వాణ్ణి చంపించండని సలహా ఇచ్చాడు బైరంఖాన్. కాని నిస్సహాయంగా వున్న మనిషిని చంపడానికి అక్బర్ నిరాకరించడంతో, బైరంఖాన్ స్వయంగా కత్తి తీసుకుని హేము శిరశ్ఛేదం చేశాడు.

పరస్పర విరుద్ధ స్వభావులైన అక్బర్, బైరంఖాన్‌ల మధ్య అభిప్రాయ భేదాలూ, అనుమానాలూ తలెత్తాయి. అక్బర్ మీద అధికారం చెలాయించడానికి బైరంఖాన్ ప్రయత్నించాడు. ఆ సంగతి పసిగట్టి అక్బర్ అతణ్ణి హఠాత్తుగా అధికార భ్రష్టుణ్ణి చేశాడు. బైరంఖాన్ ఎదురు తిరిగి, పట్టుబడిపోయాడు. చివరికి అతడు మక్కా వెళ్ళడానికి అక్బర్ అనుమతించాడు.





బైరంఖాన్‌కు శత్రువులు చాలా మంది వుండేవారు. అఫ్ఘనిస్థాన్‌కు చెందిన ఒక శత్రువు బైరంఖాన్ మక్కాకు వెళ్తున్న విషయం తెలుసుకుని, మార్గమధ్యంలో పొంచివుండి అతణ్ణి కత్తితో పొడిచి చంపాడు.

రెండవ పానిపట్టు యుద్ధంలో విజయం సాధించడం అక్బర్‌కు ఎంతో కీర్తి తెచ్చింది. అయినా విజయగర్వంతో పొంగిపోకుండా, అక్బర్, శక్తివంతులైన రాజపుత్ర రాజులతో మైత్రీ సంబంధాలు పెంచుకోడానికి కృషి చేశాడు. జైపూర్ పాలకుడైన బిహారిమల్ల కుమార్తెను వివాహం చేసుకున్నాడు.





ఆ తరవాత తన సామ్రాజ్యాన్ని విస్తరింపజేయడానికి అక్బర్ పూనుకున్నాడు. అక్బర్ దృష్టి రాణి దుర్గావతి పరిపాలిస్తున్న గోండ్వానా రాజ్యంమీదికి మళ్ళింది. భర్త పోయిన తర్వాత, చిన్నవయస్కుడైన తన కుమారుడు వీరనారాయణ్ తరఫున రాణి దుర్గావతి రాజ్యపాలన జరుపుతున్నది.

గోండ్వానాను జయించడానికి అసఫ్ ఖాన్ అనే సేనానాయకుని పంపాడు అక్బర్. హఠాత్తుగా దాడి జరగడం వల్ల, యుద్ధానికి సిద్ధంగాలేదు దుర్గావతి. అయినప్పటికీ అక్బర్ సేనలను రాణి దుర్గావతి సైనికులు ధైర్యంగా ఎదుర్కొన్నారు.





రాణి దుర్గావతి తన సేనకు స్వయంగా నాయకత్వం వహించి, తన రాజ్యం మీదికి దురాక్రమణ జరిపిన యాభై వేలమంది అక్బర్ సైనికులను ఎదుర్కొంది. యువ రాజు వీరనారాయణ్ కూడా యుద్ధ రంగంలో దిగాడు. యువరాజును ఎలాగైనా పట్టుకోడానికి వ్యూహం పన్నాడు అసఫ్‌ఖాన్.

బాణం ్రకు గురైన వీరనారాయణ్‌ను అసఫ్‌ఖాన్ సైనికులు చుట్టుముట్టారు. ఆ విషయం తెలుసుకున్న రాణి దుర్గావతి, అక్కడికి చేరి వారితో పోరాడి, కుమారుణ్ణి విడిపించి రాజ భవనానికి పంపింది. అతనికి రక్షణగా సగంమంది సైనికులు పోవడంతో ఆమె పక్షం బలహీనమైపోయింది. ఇక ఓటమి తప్పదనుకున్న రాణి దుర్గావతి కత్తితో పొడుచుకుని ప్రాణాలు వదిలింది.





రాణి దుర్గావతి మరణం తర్వాత యువరాజు వీరనారాయణ్ సేనా నాయకత్వం వహించాడు. అక్బర్ సేనలు సంఖ్యాబలంలో చాలా ఎక్కువ అని తెలిసి కూడా వీరనారాయణ్ తన దేహంలో ఆఖరి శ్వాస వున్నంతవరకూ పోరాడి వీరమరణం పొందాడు. అసఫ్‌ఖాన్ రాజ భవనాన్ని దోచుకున్నాడు.




క్రొటేనికోనలో కామయ్యా అనే ఒక కమ్మరి ఉండేవాడు. అతడు కత్తులు, కొడవళ్ళు, గునపాలూ, పారలూ—ఇటు వంటి ఇనుప సామగ్రి అంతా తన దుకాణంలో తయారు చేసేవాడు.

ఇనుముతో సామగ్రి తయారు చెయ్యట మంటే సులభం కాదు. మండే కొలిమిని గాలితిత్తులతో ఊదాలి. ఇనుమును బాగా ఎర్రగా కాల్చాలి. అలా కాలినదాన్ని చల్లారి పోకుండా దిమ్మ మీద పెట్టి, సమ్మెటతో బాదాలి. సమ్మెటతో బాదటానికి మంచి జబ్బపుష్టి కావాలి. కామయ్యకి జబ్బపుష్టీ ఉంది; చెమటోడ్చి పని చేసి డబ్బు సంపాదించుకోవాలన్న ఆసక్తీ వుంది.

కామయ్యా కొడుకు సోమయ్యా. వాడు ఉత్త సోమరిపోతుగా తయారయాడు. ఇందుకు కారణం వాడి తల్లి శేషమ్మే. శేషమ్మకి కొడుకు కొలిమి ముందు కూర్చుని కష్టపడటం ఇష్టం లేదు. మేనమామకి మల్లేనే తన కుమారుడు కూడా యేదైనా ఒక ఉద్యోగం చెయ్యాలిగాని కొలిమి దగ్గిరికే పోకూడదని ఆమె ఉద్దేశం. ఈ ఉద్దేశంతో పలకా పుస్తకాలూ కొనిచ్చి, వాడిని బళ్ళోకి పంపించింది.

కామయ్యకి ఇదేమీ నచ్చలేదు. కులవృత్తి చెయ్యకపోవటం తనకూ, లోకానికీ కూడా చెరుపేనని అతడి ఉద్దేశం. ఐనా భార్య మాటకు యెదురాడలేదు.

సోమయ్యా బళ్ళోకయితే వెళ్ళివచ్చేవాడు గాని, వాడికి చదువేమీ అబ్బలేదు. ''పోనీ, కొలిమి తిత్తివద్ద కూచుని గాలయినా పొయ్యరాదురా'' అని మందలించేవాడు కామయ్యా. కాని కూచుని పని చేయటం కన్న వీధులవెంట తిరగటమే సరదాగా కనపడి, సోమయ్యా తండ్రి కంటపడడమే మానివేశాడు.




కామయ్య క్రమంగా పెద్దవాడైనాడు, జవ సత్తువలు ఉడిగినై. ''నా తర్వాత ఈ దుకాణం మూసెయ్యవలసిందేనా ?'' అనిపించి, ఎంతో చింతించాడు. ''నేను సంపాదించినదంతా నా కొడుకు మూడు పూటల్లో తగలెట్టేస్తాడు. తర్వాత అడుక్కు తినటమే నా గతి ?'' అని తరచూ వాపో సాగాడు.

భార్యను పిలిచి, ''మనవాడిని రెంటికీ చెడ్డ రేవడుగా చేశావు! ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకోమను. కులవృత్తి నేర్చుకోమను'' అని మళ్ళీ చెప్పి చూశాడు.

''తొందరపడకయ్యా, వాడూ ఊరికే వుండలేదు. ఏదో ఉద్యోగం కోసం వెతుకులాడుతూనే వున్నాడు.'' అంది శేషమ్మ, కొడుకు మీది గారం కొద్దీ.

కామయ్యకి వొళ్ళు మండింది. ''ఏమిటీ ఉద్యోగమా! వాడికీ నీకూ కూడా కష్టార్జితం అంటే ఏమిటో తెలియకుండా పోతోంది. నేను సంపాదించిన దానితో తర్వాత కులుకుదా మనుకుంటున్నాడు కామోసు! నా స్వార్జితంలో చిల్లిగవ్వ కూడా వాడికి ముట్టనివ్వను. యేమనుకున్నావో! పని నేర్చింది మొదలు ఈనాటి వరకూ నేను రోజూ మూడు రూపాయిలైనా కళ్ళ చూడందీ దుకాణం ముయ్యలేదే. వీణ్ణి, మూడు రూపాయలు కాదు, మూడు పావలాలు సంపాదించమను చూద్దాం!'' అన్నాడు ఆవేశంతో.

అంతట్లోకి సోమయ్య వచ్చాడు. వాడితో శేషమ్మ, ''ఏమిరా నానిగా! మీ బాబు నిన్ను ఉత్త చవటగా కట్టేశాడు చూశావ్రా. మూడు పావలాలైనా సంపాదించలేవుట నువ్వు!'' అంది.

సోమయ్య, ''ఓస్, అదెంత! చిటికెలో గడించుకొస్తా''నన్నాడు.

సోమయ్య వెళ్ళేడు. కాని వాడికి సంపాదనంటే యేదో తెలిస్తేగా ? పావలా కాసులు చెట్టుకి కాస్తాయా యేమన్నానా, కోసుకు చక్కా రావటానికి? మూడు ఝాములదాకా అక్కడా అక్కడా తిరిగి

వచ్చి, "అమ్మా, తల నొప్పిగా వుందే ఎండనబడి తిరిగొస్తేను," అన్నాడు.

"ఏమైనా గడించావుట్రా బాబిగా ?" అంది శేషమ్మ.

"లేదు. భోంచేసి వెడతాలే మళ్ళీ," అన్నాడు సోమయ్య.

సోమయ్య భోజనం చేసి పడుకుని సాయంత్రం దాకా నిద్రపోయాడు. తండ్రి దుకాణం నుంచి వచ్చి, "మూడు పావలాలు ఏవిరా?" అంటే యేమిటి చెప్పడం? వాడికి తటాల్న ఒక ఆలోచన తట్టింది. "అమ్మా, రేపు సంపాదిస్తాను. ఇవేళ మట్టుకి నా మూడు పావలాలూ నువ్వియ్యవే," అన్నాడు.

తండ్రి ముందు, కొడుకు నవ్వులపాలు కాకుండా శేషమ్మ గదుల పెట్టెలోంచి మూడు పావలా కానులు తెచ్చియిచ్చింది.

కామయ్య చీకటిపడే వరకూ దుకాణంలో పనిచేసి ఇంటికొచ్చాడు. సోమయ్య దాబుగా జేబులోంచి మూడు పావులాలూ తీసి తండ్రి చేతిలో పడేసి, "చూడు!" అన్నాడు. కామయ్య, ఆ మూడు పావలా కానుల్ని ఒకమాటు అటూ ఇటూ తిరగేసి, "ఎక్కడివిరా అబ్బీ ఇవీ?" అని అడిగాడు. "ఎక్కడివేమిటి? పొద్దస్తమానం ఎద్దులా పనిచేసి సంపాదిస్తేను?" అని దబాయించాడు సోమయ్య.




"ఇది నీ కష్టార్జితం కాదు!" అంటూ ఆ మూడు పావలాలూ మండుతోన్న పొయ్యిలోకి విసిరేశాడు కామయ్య.

మర్నాడు శేషమ్మ సోమయ్యతో, "ఇవాళైనా గడించుకు రారా" అంది. వాడానాడు తల్లికి తెలవకుండానే ఒక రూపాయి గదుల పెట్టెలోంచి తీసుకుపోయి మిఠాయి దుకాణం మీద మార్చి, పావలా పకోడీలకీ జీడిపప్పు పాకానికీ ఖర్చుపెట్టి, మిగతా ముప్పావులా తెచ్చి, "సంపాదించా" నంటూ రాత్రి తండ్రి చేతిలో పడేశాడు. క్రిందటి రోజుకు మల్లేనే తండ్రి ఆ మూడు పావలా కానులూ తిరగేసి మరగేసి "ఇదీ నీ కష్టార్జితం కాదు, నన్ను మోసగించ

బోకు,'' అంటూ వాటిని కూడా పొయ్యిలోకి విసిరేశాడు.

మూడోనాడు సోమయ్యకి గదుల పెట్టెలో ఏమీ చిక్కలేదు. అంతేకాకుండా తనది కష్టార్జితం కాదని తండ్రికి తెలిసిపోతోంది కూడాను. నిజంగా గడించి తేవాలని వాడు నిశ్చయించాడు. ఊళ్ళోని కోనలో శనివారం సంత. వాడు సంతకు పోయి, మూటా ముల్లే మోసి కూలి డబ్బులు ఆర్జించటం ప్రారంభించాడు. చీకటి పడేదాకా మోసినా పావలా పోగవలేదు. మర్నాడు బళ్ళఘాటీ వద్దకు పోయి పెట్టే బేడా ఊళ్ళోకి మోసుకుపోవటానికి ఒప్పుకొని డబ్బు గడించాడు. బలమైన వాడే ఐనా సోమయ్యకి శ్రమపడటం అలవాటులేదు గనక పెట్టెలు మొయ్యటమంటే కష్టమే అనిపించింది. కాని పట్టుదలతో పనిచేశాడు. ఐతేం, రోజంతా మోస్తే ఆరణాల కన్న ఎక్కువ కిట్టలేదు. మర్నాడు కూడా మోస్తేగాని ముప్పావలా కూడలేదు.

ముప్పావలా పోగవటంతోనే సోమయ్య ఇంటికి వచ్చి తండ్రి చేతిలో పెట్టాడు. కామయ్య యథాప్రకారం ''ఇదీ నీ కష్టార్జితం కా''దంటూ పొయ్యిలోకి విసిరేశాడు.

కాని ఈమాటు సోమయ్య ఇదివరలో మోస్తరుగా చూస్తూ ఊరుకోక పరుగెత్తి వెళ్ళి పొయ్యిలోంచి పావలాకాసుల్ని గబగబా పైకి లాగేడు.

కామయ్య చిరునవ్వుతో ''అబ్బాయీ! ఇదీ నీ కష్టార్జితం. ఇంతకుముందు రెండుసార్లు సొమ్ము పొయ్యిలో పారేస్తే నిన్నురవంతైనా బాధించలేదు. ఎంచేత? అది నీ కష్టార్జితం కాదు గనక! కష్టార్జితమైన సొమ్ము మీద ఇలాగే మమకారం వుంటుంది. ఎవడో గడించి ఇస్తే దాని విలువ తెలీదు. కనుక యెవడి మానాన వాడు కష్టపడి గడించుకోవాలి," అన్నాడు.

''నిజమే నాన్నా,'' అన్నాడు సోమయ్య. ఆర్జన విలువ తెలిసిన సోమయ్య కష్టపడి ప్రయోజకుడై, తలిదండ్రులను సంతోషపెట్టి, తనూ సుఖపడ్డాడు.



# అపశకునం!

విశ్వపతి ఏదో తొందర పనిమీద పట్నం బయలుదేరాడు. గుమ్మం దిగుతూండగా, పక్కింటి పాలేరు కొడుకు నెత్తిమీద కొత్త కుండతో ఎదురయ్యాడు.

"శకునం బాగాలేదు. ఇలాంటివి తప్పక నష్టం కలిగించగలవు. లోపలికి వచ్చి, కాళ్ళు కడుక్కుని కొద్దిక్షణాలు గడిపితే బావుంటుంది," అన్నది, సాగనంపడానికి గుమ్మం వరకూ వచ్చిన అతడి భార్య.

ఈ శకునాలూ, ముహూర్తాలూ అంటే నాకు బొత్తిగా నమ్మకం లేదు, అంటూ ప్రయాణం సాగించాడు విశ్వపతి. అయితే, భర్త అనుకున్న రోజుకు ఇంటికి తిరిగి రాకపోవడంతో అతడి భార్య, ఏదో కీడు కలిగి వుంటుందనుకుని, పురోహితుడు రామశాస్త్రికి జరిగిన సంగతి చెప్పింది.

అపశకున దోషం పోవడానికి శాంతి చెయ్యాలి, అందుకు వంద రూపాయలు ఖర్చు అవుతుందన్నాడు, రామశాస్త్రి. విశ్వపతి భార్య అయనకు వందరూపాయిలిచ్చింది. శాస్త్రి శాంతి జరిపించాడు.

మరి రెండు రోజులు గడిచాక విశ్వపతి పట్నం నుంచి వచ్చాడు. భార్య ద్వారా సంగతి తెలుసుకుని, అపశకునం దాని ఫలితం చూపించిందని నమ్మాడు.

—భైరి సత్యనారాయణ





# స్వార్థపండితుడు

మరాళదేశాన్ని పుష్పకాంతు డనే రాజు పాలించే కాలంలో, ఆయన ఆస్థానంలో ముచికుందు డనే పండితు డుండేవాడు. అతడు పెద్ద స్వార్థపరుడే కాక, అహంకారి కూడా. ముందుగా అతణ్ణి ఆశ్రయించి, తమ మాటలతో, సేవలతో మెప్పించిన వారికే రాజాస్థానంలో ప్రవేశం ధొరికేది. ఈ కారణం వల్ల ఎందరో సమర్థులైన పండితులూ, జ్ఞానులూ రాజాశ్రయం లభించక పరదేశాలకు వలసపోయారు.

ఇలాంటి పరిస్థితుల్లో కృష్ణకాంతు డనే యువకుడు గురుకులంలో విద్యాభ్యాసం పూర్తిచేసి, రాజాశ్రయం కోసం వచ్చాడు. అతడికి కొద్ది రోజుల్లోనే ఆస్థాన స్థితి గతులూ, ముచికుందుడి స్వార్థపరత్వం గురించి తెలియవచ్చింది.

కృష్ణకాంతుడు తానెరిగిన ఒక బంధువు ద్వారా, రాజనర్తకి మందార మాల పరిచయం సంపాయించుకున్నాడు. ఆమె కృష్ణకాంతుడి పాండిత్యం చూసి ముగ్ధురాలై, అతడికి తప్పక రాజదర్శనం అయేలా చేస్తానని మాట యిచ్చింది.

ఒకరోజున మందారమాల నాట్యప్రదర్శనానికి ఆస్థానానికి వెళుతూ, కృష్ణకాంతుణ్ణి వెంటబెట్టుకుపోయింది. రాజనర్తకి తోడుగా వున్నందున ద్వారపాలకులెవరూ అతణ్ణి అడ్డగించలేదు.

ఆమె తన నాట్యం ముగిశాక, కృష్ణకాంతుణ్ణి రాజు వద్దకు తీసుకుపోయి, "మహారాజా, ఈయన కృష్ణకాంతుడనే యువ పండితుడు, మా గురువుగారి తమ్ముని కుమారుడు. తమ ఆశ్రయం అర్థించ వచ్చాడు," అని చెప్పింది.

రాజు కృష్ణకాంతుడి కేసి పరిశీలనగా చూస్తున్నంతలో, అతడు "మహారాజా, నేను కాశీలో విద్య పూర్తి చేసుకుని

ఎం. లక్ష్మిగాయత్రి

వచ్చాను. పంచకావ్యాలతోపాటు, అన్ని శాస్త్రాలూ అధ్యయనం చేశాను. ఆశువుగా కవనం చెప్పగలను," అన్నాడు.

రాజు తల వూపి చిరునవ్వు నవ్వాడు. ఇది చూసి కలవరం చెందిన ముచికుందుడు హేళనగా, "ఇంతటి విద్యావంతుడికి, పండితుల ద్వారా కాక, రాజనర్తకి సాయెంతో ఆస్థానానికి రావలసిన దుర్దశ ఎందుకు కలిగినట్టు?" అన్నాడు.

వెంటనే కృష్ణకాంతుడు రాజుతో, "అహంకారం, స్వార్థం లేనివాళ్ళే నిజమైన పండితులు. అందువల్ల యిక్కడున్న ప్రధాన పండితులవారిని కాక, రాజనర్తకిని ఆశ్రయించవలసి వచ్చింది," అన్నాడు.

ఆ మాట వింటూనే రాజు కనుబొమలు ముడిచి, ముచికుందుడి కేసి ఆశ్చర్యంగా చూశాడు. ముచికుందుడు తీవ్రస్వరంతో, "నిన్నగాక మొన్న విద్యాభ్యాసం ముగించిన వాడిలో, పండితులపట్ల యింత చులకన భావమా! ప్రభూ, యితణ్ణి వెంటనే సభ నుంచి బయటికి పంపవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

కృష్ణకాంతుడు మందహాసం చేసి, ముచికుందుడితో, "సాటి పండితుణ్ణి సభ వదిలి పొమ్మని చెప్పవలసిన తీరు



అది కాదు. చేతనైతే వాదంలో ఓడించండి. అప్పుడు మీకు క్షమాపణ చెప్పుకుని వెళ్ళిపోతాను. అలా కానప్పుడు మీ దురుసు ప్రవర్తనకు, మీరే నాకు క్షమాపణ చెప్పవలసి వుంటుంది," అన్నాడు.

రాజు ముచికుంద, కృష్ణకాంతుల మధ్య వాదం ఏర్పాటు చేశాడు.

ముచికుందుడు, కృష్ణకాంతుణ్ణి అనేక ప్రశ్నలడిగాడు. అన్నిటికీ అతడు సరైన జవాబు లిచ్చి, సభలో వున్నవారి నుంచి ప్రశంసలు పొందాడు.

ఇప్పుడు ప్రశ్నించడం కృష్ణకాంతుడి వంతు. అతడు ముచికుందుడితో, "తమర్ని మూడే మూడు ప్రశ్నలడుగు

తాను. సరైన సమాధానాలివ్వండి.'' అని యిలా అడిగాడు:

పదిమందితో పంచుకున్న కొద్దీ పెరిగేది ఏది ? ఏది ఉత్తమ ప్రశ్న అనిపించుకుంటుంది? ఎటువంటివాడు ఉత్తమ గురువు ?

ఈ ప్రశ్నలు వింటూనే ముచికుందుడు ఆగ్రహావేశం చెంది, ఏవేవో జవాబులిచ్చాడు. అవేవీ సరైన జవాబులు కాదన్నాడు కృష్ణకాంతుడు.

''అయితే, నువ్వే సరైన జవాబులిచ్చి మహారాజు నుంచీ, సభనుంచీ ఆమోదం సంపాయించు,'' అన్నాడు ముచికుందుడు.

అప్పుడు కృష్ణకాంతుడు, ''పదిమందితో పంచుకున్న కొద్దీ పెరిగేది సంతోషం. సందేహ నివృత్తికోసం వేసేదే ఉత్తమ ప్రశ్న అనిపించుకుంటుంది; దాని ప్రయోజనం జ్ఞానసంపాదన కనక. విద్యార్థిలో విజ్ఞానతృష్ణ కలిగించగలవాడే ఉత్తమగురువు. అలాంటి తృష్ణకలవాడు ఎప్పటికీ సంతృప్తి చెందడు; ఇంకా, ఇంకా విజ్ఞానం కోసం అన్వేషిస్తూనే వుంటాడు,'' అన్నాడు.

రాజు తృప్తిగా తలాడించాడు. సభ అంతా హర్షధ్వానాలతో మారుమోగిపోయింది. ముచికుందుడు అవమానంతో తల పంచుకున్నాడు. కృష్ణకాంతుడు రాజుకు ముచికుందుడి దుష్ప్రవర్తనను గురించి వివరించాడు.

అంతా విన్న రాజు, ''ఇటువంటి పామరుణ్ణి, యింత కాలంగా పండితుడని భ్రమించాను !'' అన్నాడు కోపంగా.

''మహారాజా, యిప్పుడు జరిగినదానితో ముచికుంద పండితుడిలోని స్వార్థం, అహంకారం నశించిపోగలవని, నేననుకుంటున్నాను. మీరాయనను క్షమించవచ్చు,'' అన్నాడు కృష్ణకాంతుడు.

రాజు మౌనంగా తలాడించి వూరుకున్నాడు. ముచికుందుడు రాజుకూ, కృష్ణకాంతుడికీ నమస్కరించి, తలవంచుకుని సభనుంచి బయిటికిపోయాడు.



# బాకీ వసూలు

నరసయ్య ఎవరిదగ్గిరయినా అప్పు తీసుకుంటే, తిరిగి యివ్వడానికి నానా యిబ్బందీ పెట్టేవాడు. ఒకసారి అతను పొరుగింటివాడైన రామరాజును, తాను మహా యిబ్బందుల్లో వున్నానని బతిమాలి రెండువందలు అప్పుగా తీసుకున్నాడు. తరవాత నాలుగైదు నెలలు గడిచినా అప్పు చెల్లించక పోగా, ఒక్కొకసారి ఇంట్లో వుండీ లేడని చెప్పించసాగాడు.

ఒకనాడు నరసయ్య సంతలో పాడి ఆవును కొనేందుకు వెళుతున్నాడని రామరాజుకు తెలిసింది. అతనూ కొంచెం ఆలస్యంగా సంతకు వెళ్ళాడు. నరసయ్యకు తనకు నచ్చిన పాడి ఆవు దొరకలేదు.

ఇద్దరూ చీకటిపడుతూండగా ఇంటికి తిరిగి వస్తున్న సమయంలో, దారి పక్కన వున్న పొదలచాటు నుంచి ఒకడు పెద్ద బాణాకర్రతో వాళ్ళకేసి వస్తూ, "మర్యాదగా వున్న డబ్బు యిచ్చెయ్యండి, బుర్రలు పేలిపోగలవు!" అన్నాడు భీకరంగా.

దొంగ తమను సమీపించేలోపలే నరసయ్య తన దగ్గిరున్న డబ్బు మూటను రామరాజు కిస్తూ, "ఇందులో మూడువందలున్నాయి. అసలూ, వడ్డీపోగా, మిగిలిందేదో తరవాత యిద్దువు గాని," అన్నాడు.

దొంగ డబ్బుమూట గుంజుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు రామరాజు తన జీతగాడి ద్వారా నరసయ్యకు ఇరవైరూపాయలు పంపుతూ, ఒక చీటీలో, "నరసయ్యా, నీ అప్పు తీరిపోయింది. రాత్రి వచ్చిన దొంగ కూలీ, నా వడ్డీ పోగా మిగిలింది పంపుతున్నాను," అని రాశాడు.

—దాసరి వెంకటరమణ





# సహజ చిత్రం

చిగురుపాడు జమీందారు చిన్నారాయుడికి ఆడంబరాలంటే అసలు కిట్టేది కాదు. ఆశ్రితుల్లో ఎవరైనా ఆయనకు లేని లక్షణాలు ఆపాదించబోయినా, పొగడ్తలతో సంతోషపరచాలని చూసినా, అలాంటి వాళ్ళను సత్కరించడానికి బదులు, తీవ్రంగా మందలించేవాడు.

చిన్నారాయుడి భవనంలో, ఆయన పూర్వీకుల నిలువెత్తు చిత్రపటాలెన్నో వుండేవి. అందులో వున్నవాళ్ళందరూ ఎంతో గంభీరంగా, అంతులేని దర్పాన్ని ఒలకబోస్తూ చిత్రించబడ్డారు. తన పూర్వీకుల నిజమైన రూపురేఖలూ, స్వభావాలూ ఎలాంటివో ఆయన ఆ నోటా, యీ నోటా విని వున్నాడు. తమ పోషకుల్ని సంతోషపరిచేందుకే చిత్రకారులు, వాళ్ళ రూపురేఖలకు లేనిపోని మెరుగులు దిద్దారని ఆయన అనుకునేవాడు.

చిన్నారాయుడికి తన నిలువెత్తు తైలవర్ణ చిత్రం వేయించుకోవాలన్న ఆలోచన కలిగింది. అయితే, అది అతి సహజంగా చిత్రీకరించబడాలని ఆయన కోరిక. కొండపల్లి సంస్థానంలో వుంటున్న గోవిందభట్టు అనే చిత్రకారుడు దేన్నయినా అతి సహజంగా, వాస్తవంగా చిత్రిస్తాడని ఆయనకు తెలియవచ్చింది.

జమీందారు గోవిందభట్టును పిలిపించి, "మీరు గొప్ప చిత్రకారులని విన్నాను. లేనిపోని హంగులేవీ పెట్టకుండా, యథాతథంగా నా రూపురేఖల్ని చిత్రించాలి. అలా చేస్తేనే, నేను మీ కివ్వాలనుకున్న పారితోషికం ముట్టుతుంది." అన్నాడు.

గోవిందభట్టు సరేనని తన పని ప్రారంభించి, కొద్ది రోజుల్లో చిన్నారాయుడి చిత్తరువును పూర్తి చేశాడు. తరవాత దిద్దవలసిన తుది మెరుగులన్నీ దిద్ది,

కమలిని

చిత్రపటాన్ని చిన్నారాయుడి దగ్గిరకు తీసుకుపోయి, "ప్రభువులు చెప్పినట్టుగానే చిత్రం అతిసహజంగా తయారైంది. ఒకసారి పరికించండి!" అన్నాడు.

గోవిందభట్టు చెప్పినదాంట్లో అబద్ధం ఏమీలేదు. ఆయన జమీందారును సహజాతి సహజంగా చిత్రించాడు. కాని, గోవిందభట్టును పరీక్షించాలనే ఉద్దేశంతో చిన్నారాయుడు, "నీ చిత్రకళా నైపుణ్యాన్ని పొగడుకోవడం కాకపోతే, యిది అచ్చు నా రూపమే అని ఎలా రూఢి పరచగలవు?" అని అడిగాడు.

దానికి గోవిందభట్టు, "చిత్రం పూర్తి కాగానే, దీన్ని మన పడుగుపాడు జమీందారు పాపారాయుడుగారికి చూపించాను. చిత్రం మీ నిజరూపానికి ప్రతిబింబం అనడంలో సందేహంలేదని వారు అభిప్రాయపడ్డారు," అన్నాడు.

ఆ జవాబుకు జమీందారు ఆశ్చర్యపోతూ, "పాపారాయుడికీ, మాకూ మనస్పర్థలున్నాయి. అంతేకాక, అతడికి చిత్రకళలాంటి వాటిపట్ల ఏమాత్రం అనక్తిలేదు. అలాంటివాడికి నా చిత్తరువు చూపించడంలోని, నీ ఆంతర్యం అర్థంకావడంలేదు," అన్నాడు.

"పాపారాయుడుగారికీ, మీకూ మధ్య విరోధభావంవున్న సంగతి నాకు తెలుసు. ఆ కారణంవల్లనే, చిత్తరువులో ఏదైనా అసహజం లాంటిది వుంటే, బాహాటంగా చెప్పడానికి ఆయన సంకోచించరు.



అందుకే వారికి చూపించాను! ఆయన చప్పిపడుతున్న మీ దవడలనూ, కుడి కణితి కిందవున్న గాయపు మచ్చనూ, నేను గోప్యంగా చిత్రించినా గుర్తించారు. ఉన్నవాణ్ణి వున్నట్టుగా చిత్రించావు, ఏమైనా కోపం తెచ్చుకుంటాడేమో చూసుకో, అన్నారు,'' అన్నాడు గోవిందభట్టు.

చిన్నారాయుడు, ''అదా సంగతి!'' అని ఒక క్షణం ఆగి, ''ఇక్కడి దివాణంలో ఎవరికైనా చూపించావా?'' అని అడిగాడు, గోవిందభట్టును.

''అవును, దివానుగారికీ, మహారాణి గార్కికీ చూపించాను. వారి అభిప్రాయం ఏమిటో, తమరే స్వయంగా తెలుసుకోండి,'' అన్నాడు గోవిందభట్టు.

చిన్నారాయుడు దివానుకు కబురు పెట్టి, తైలవర్ణ చిత్రాన్ని గురించి ఆయన అభిప్రాయం ఏమిటో చెప్పమన్నాడు.

''గోవిందభట్టు గీసిన చిత్రంలో నాకేదో లోపం కనబడుతున్నది. ఆయన మిమ్ము లను, మీ తాతతండ్రులంత హుందాగా చిత్రించలేదు. నిజానికి మీరు శ్రీకృష్ణ దేవరాయలవారికన్న గంభీరంగా కనబడ తారు,'' అన్నాడు దివాను.

తరవాత జమీందారు చిత్రాన్ని తన భార్యకు చూపించాడు. ఆమె చిత్రం కేసి పరిశీలనగా చూసి, ''చిత్రంలో మీ ఠీవీ, హుందా, మీ పూర్వులకు ఏమాత్రం తీసి పోదు. కాని వయసు విషయానికొస్తే, ఇప్పటి మీ వయసుకన్న చిత్రంలో మరి అయిదారేళ్ళు పెద్దవార్‌లా కనబడు తున్నారు,'' అన్నది.

చిన్నారాయుడు ఆ మాటలకు మంద హాసం చేసి గోవిందభట్టుతో, ''నా మీది భక్తివిశ్వాసాలవల్ల దివానూ, ప్రేమానురాగాల కారణంగా మహారాణీ చిత్రాన్ని గురించి సరిఅయిన అంచనా చెప్పలేరు. ఇందుకు నా పట్ల సద్భావంలేని జమీందారు పాపారాయుడే తగు. చిత్రాన్ని అతిసహజంగా చిత్రించి, మీరు గొప్ప చిత్రకారులన్న పేరు సార్థకం చేసుకున్నారు,'' అని, అతణ్ణి ఘనంగా సన్మానించాడు.






హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి ఆలింగనం చేసుకొని, "ప్రహ్లాదా! నీ మూలంగా ఇన్నాళ్ళకు విష్ణువుపై పగతీర్చుకొనే అవకాశం లభించింది!" అని చెప్పి గదను ఎత్తి నరసింహావతారంతో పోరాటానికి తలపడ్డాడు. చివరకు నరసింహం ప్రళయ గర్జన చేస్తూ ఎగిరి, హిరణ్యకశిపుడిపై ఉరికి ఒడిసిపట్టుకొని, సభామంటప ద్వారం దగ్గరకు తీసుకువెళ్ళాడు.

లోపలా, వెలుపలా కాని ద్వారం అరుగుమీద, రాత్రీ, పగలూ కాని సంధ్యా సమయంలో, ఆకాశమూ, భూమీ కాని తన తొడల మీద పెట్టుకొని, సజీవములూ, నిర్జీవములూ కాని గోళ్ళతో, బ్రహ్మవలన పొందిన వరాలన్నిటికీ, భిన్నంగా, విష్ణువు నరసింహరూపంతో హిరణ్యకశిపుడి రొమ్మునూ, పొట్టనూ భీకరంగా చీల్చి చంపాడు.

రాక్షసులు సమూహంగా నరసింహుణ్ణి ఎదుర్కోడానికి రాగా విష్ణుచక్రం వారిని అంతం చేసింది.

నరసింహమూర్తి ప్రేగుల్ని కంఠహారాలుగా వేసుకొని, ఉగ్రంగా చేస్తున్న అట్టహాసానికి దేవతలు భయపడ్డారు. లక్ష్మీదేవి కూడా భయపడింది. అప్పుడు ప్రహ్లాదుడు నరసింహావతారుణ్ణి స్తుతించి శాంతింపజేశాడు.

తండ్రికి ఉత్తరక్రియలు జరిపి, రాజ్యపాలన చేయవలసిందని చెప్పి ప్రహ్లాదుణ్ణి దీవించి, నరసింహావతారుడైన విష్ణువు

## 6. త్రివిక్రమ వామనావతారం



అంతర్థానమయ్యాడు. జయవిజయుల తొలిజన్మ ముగిసింది.

విష్ణువు అనతిప్రకారం ప్రహ్లాదుడు చిరకాలం రాజ్యపాలనచేసి, కుమారుడైన విరోచనుడికి పట్టంకట్టి, విష్ణుభక్తి తత్పరుడై వనాలకు వెళ్ళాడు.

విరోచనుడి తర్వాత అతని కుమారుడు బలి రాజ్యానికొచ్చాడు. క్షీరసాగరమథనంలో పుట్టిన ఉచ్చైశ్రవాన్ని బలి, తీసుకున్నాడు. రాక్షసులశిల్పి మయుడు అతనికి నేలపైనా, నీటిలోనూ, అంతరిక్షంలో పోగల గొప్ప వాహనాన్ని నిర్మించి యిచ్చాడు.

అమృతం తమకు దక్కకుండా జరిగిన అన్యాయానికి ప్రతీకారంగా దేవతలతో యుద్ధానికి దిగాడు. దేవతలు అమృతం సేవించిన ధైర్యోత్సాహాలతో రాక్షసులను ఎదుర్కొన్నారు. బలి ఇంద్రుడితో గొప్పగా పోరాడాడు. దేవప్రముఖులకూ, రాక్షసప్రముఖులకూ ముఖాముఖీగా, విడివిడి యుద్ధాలు సాగాయి. ఆ దేవదానవ సంగ్రామంలో రాక్షసులు చిత్తుగా ఓడిపోయారు. హతులైన రాక్షసులను రాక్షసుల గురువైన శుక్రాచార్యుడు మృతసంజీవనీ విద్యను ప్రయోగించి తిరిగి బ్రతికించాడు.

ఓటమితో బలి మరింత పట్టుదలతో రాక్షసులందర్నీ కూడగట్టుకొని నాయకుడై, భూమండలం అంతటినీ జయించి, కట్టుదిట్టంగా పరిపాలన సాగిస్తూ, బలిచక్రవర్తి అనిపించుకున్నాడు. శుక్రుడు అతనిచేత నూరు అశ్వమేధయాగాలు చేయించాడు.

బలి విజృంభించి స్వర్గం మీదకు దాడి చేశాడు. అతని ధాటికి వెరచి ఇంద్రాది దేవతలు స్వర్గాన్ని వదలి అరణ్యాలు పట్టారు. దిక్పాలకులు బలిచక్రవర్తికి వశవర్తులై మెలగసాగారు. స్వర్గమర్త్యపాతాళ ముల్లోకాలను బలిచక్రవర్తి ధర్మబద్ధంగా పాలిస్తూండగా, ఇంద్రుడి తల్లి అదితి భర్త కశ్యపప్రజాపతితో తన సంతతి వారైన దేవతలు, ఇంద్రుడు, శచీదేవి

అరణ్యాల్లో పడుతున్నపాట్లు చెప్పుకొని, వారికి తిరిగి స్వర్గసామ్రాజ్యం చేకూరే మార్గం చెప్పమన్నది.

అందుకు విష్ణువును గూర్చి వ్రతం చెయ్యమని కశ్యపుడు ఉపదేశించాడు. అదితి విష్ణువును ఆరాధించి మెప్పించింది. విష్ణువు ఆమె కడుపున పుట్టి దేవతలకు స్వర్గం సమకూర్చిపెడతానని చెప్పాడు.

ఆ విధంగా విష్ణువు అదితి కశ్యపులకు పొట్టి పిల్లవాడైన కుమారుడుగా పుట్టి, దశావతారాల్లో ఐదవదైన వామనావతారాన్ని ఎత్తాడు.



వామనుడు ఉపనయనం పొంది వేద విద్య పూర్తిచేసి, ఇంద్రుడి తమ్ముడుగా, అదితి అల్లారు ముద్దుబిడ్డగా పెరిగాడు.

అప్పుడు బలిచక్రవర్తి నర్మదానదీ తీరంలో, యాగాల్లోకల్లా గొప్పదైన విశ్వజిద్యాగాన్ని శుక్రుని అధ్వర్యంలో ప్రారంభించి గొప్పగొప్ప దానాలు చేస్తున్నాడు.

వామనుడు ఒడుగుజందెము, కృష్ణాజినము, కమండలం మొదలైనవాటిని ధరించి గొడుగూ, పావుకోళ్ళూ వేసుకొని, మూర్తీభవించిన బ్రహ్మతేజస్సుతో బలి చక్రవర్తి దగ్గరికి బయలుదేరాడు.

బుడి బుడి నడకలతో వస్తున్న వామనుణ్ణి చూసి, యాగశాలలో అంతా ముచ్చటపడ్డారు. వామనుడు బలిచక్రవర్తి ఎదుటకు వెళ్ళి జయం పలికాడు.

వామనుణ్ణి చూడడంతో బలిచక్రవర్తికి మహదానందం కలిగింది. "చిట్టినాయనా! ఎవరునువ్వు? ముక్కుపచ్చలారని సరికొత్త వటువుగా ఎక్కడికి బయల్దేరావు?" అని అడిగాడు.

వామనుడు, "నీ దగ్గిరికే బయల్దేరి వచ్చాను. ఎవర్నని చెప్పేది, అంతా నావారే! అయినా ఇప్పుడు ఒంటివాణ్ణి; సిరిగలవాడినే, అయినా ఇప్పుడు యాచకుణ్ణి! నీ ముత్తాతలు వీరాధివీరులు, ఇక నీ బల పరాక్రమాలు దిగంతాలు దాటాయి!" అని అంటూంటే, బలిచక్ర



వర్తి నవ్వుతూ, "నీ మాటలు చిత్రంగా వున్నాయి. పరాక్రమం గురించి మాట్లాడుతున్నావు. యుద్ధం చేయమనవుగద ? నేనిప్పుడు యాగదీక్షలో కంకణం కట్టుకొని ఉన్నానాయెను, యుద్ధప్రసక్తిలేదుమరి!" అని వినోదంగా అన్నాడు.

వామనుడు, "ఎంతమాట బలిచక్రవర్తీ! ఏదో నాతో పరిహాసం ఆడావుగాని మహోన్నత బల విక్రముడివైన నీ ముందర భూమికి అంటుకుపోతున్న పొట్టికుంకను నేనెక్కడ? మేటి దాతవై అంతులేని దానాలు చేస్తున్న నీ కీర్తివిని నిన్ను యాచించి దానం పుచ్చుకోవాలని వచ్చాను!" అన్నాడు.

"అలాగే పుచ్చుకో. నువ్వు ఏమడిగినా ఇస్తాను!" అని బలిచక్రవర్తి అన్నాడు.

అప్పుడు శుక్రాచార్యుడు బలిచక్రవర్తిని పిలిచి, "వామనుడెవరో కాదు, విష్ణువు! నిన్ను వంచించి, నీ సర్వస్వాన్నీ హరించడానికి వచ్చాడు. అతనికి ఎటువంటి దానప్రదానమూ చేయవద్దు!" అని హెచ్చరించాడు.

బలిచక్రవర్తి, "విష్ణువంతటి వాడు దేహీ అని చేయిచాచగా, నా చేయి మీదై దానం యివ్వడం గొప్ప అదృష్టమే కాకుండా, నా ఘనవిజయాన్ని చాటుతుంది! అంతేగాకుండా, ఇస్తానని లేదనడం అసత్యదోషం కదా!" అన్నాడు.

శుక్రుడు, "ఆత్మరక్షణకు అది అసత్యం అనిపించుకోదు. తనకు మాలిన ధర్మం ఆత్మహత్యాపాతకంతో సమానం!" అన్నాడు.

"ఏది ఏమైనా, అతడు నన్నేమిచేసినా, నేనేమైపోయినా అది నా ఓటమి కాదు, ధర్మవీరమే అవుతుంది! శిబిప్రముఖుల్లాగ దానశీలుణ్ణి అనిపించుకోవాలనే కీర్తికాంక్ష కూడా నాకులేదు. పిరికితనంతో అడిగినది ఇస్తానని, లేదని తప్పించుకొనే భీరువు అనిపించుకోవడం, నాకు సాధ్యంకాదు." అని బలిచక్రవర్తి అన్నాడు.

ఆ మాటలకు శుక్రుడు కోపంతో, "గురువుగా నీహితవుకోరి చెప్పింది వినకుండా

ధిక్కరిస్తున్నావు. నీ సర్వస్వాన్నీ, రాజ్యాన్నీ కోల్పోతావు!'' అని కోపంతో శపించినట్లు అన్నాడు.

బలిచక్రవర్తి, ''గురుదేవా! నన్ను శపించావని వరిమాట పడ్డావేగాని, నేను అన్నిటికీ తల ఒగ్గే దానం యివ్వడానికి సిద్ధపడ్డాను గదా! గురుధిక్కారం చేసి పొందిన శాపాన్ని విష్ణువు అమలు చేశాడే గాని, అన్యాయంగా బలిని వంచించలేదని విష్ణువుకి మాటరాకుండా నీ శాపం మేలు చేసింది! నీ శాపాన్ని సంతోషంగా స్వీక రిస్తున్నాను!'' అన్నాడు.

శుక్రుడు తెల్లబోయి నిరుత్తరుడై తల వంచుకున్నాడు. బలి వామనుడి దగ్గిరికి వెళ్ళబోతూండగా శుక్రుడు, ''ఓ దానవ నాథా! విష్ణువు బిచ్చానికి వచ్చి నిన్ను బిచ్చగాణ్ణే చేస్తాడో, అథఃపాతాళానికి అణి చేస్తాడో, ఏంచేసినా చెయ్యవచ్చు. ఈ త్రిలోకాధిపత్యమూ, సంపదలూ, వైభ వమూ దేనికి కష్టించి సంపాదించావు? శరీరం తర్వాతనే కదా ఏ ధర్మసాధన అయినా!'' అని అన్నాడు.

బలి, ''రాజ్యమూ సంపదలూ సతతము వుండేవి కావు. ఎలా సంపాదించానో అలాగే పోగొట్టుకోవడం సహజమేకదా. శరీరం కూడా శాశ్వతం కాదుగదా!'' అన్నాడు.




శుక్రుడు, ''నీ వినాశం నీ ఒక్కడిదే కాదు, దానవకులానికే ముప్పు, అవమా నమూ తెస్తుందని తెలుసుకో!'' అన్నాడు.

''అంతేకాదు, ఒక దానవుడు ధర్మ పాలన చేశాడు, విష్ణువుకి భిక్ష పెట్టాడు! అని దానవకులాని కంతటికీ ఘనత తెస్తుంది కదా!'' అని బలిచక్రవర్తి వామ నుడి దగ్గిరికి వెళ్ళాడు.

భార్య వింధ్యావళి స్వర్ణకలశంతో నీళ్లు పోయగా బంగారు పళ్ళెంలో వామనుడి పాదాలు కడిగిన నీటిని శిరసున చల్లుకొని, బలిచక్రవర్తి వామనుడితో, ''ఓ వామన రూపా! నీవంటి వాడు దానం కోసం రావడం నా సుకృతం! నీకేం కావాలో



అడుగు! సిరులు, సంపదలు, భవంతులు, మణులు, సుందరీమణులు, సస్యక్షేత్రాలు, సామ్రాజ్య సర్వమూ, నా తనువు—అన్నీ నీవే!'' అన్నాడు.

వామనుడు, ''మహాబలీ ఆగవయ్యా! నీవు వల్లించినవన్నీ నా కెందుకు? కృష్ణాజినం పరుచుకూర్చొని బ్రహ్మనిష్ఠ జరుపుకోడానికి నా చిట్టిపాదాలతో మూడు అడుగుల చోటు చాలు! మూడడుగుల నేల, నీ దిగంతపర్యంతమైన సామ్రాజ్యంలో స్వల్పాతి స్వల్పమే అయినా, నాకు అదే ముల్లోకాల సాటి!'' అన్నాడు.

''ఆ మూడడుగులే పుచ్చుకో!'' అని బలిచక్రవర్తి జలకలశం వంచి ధారాదత్తం చేయబోతే నీరుపడలేదు. శుక్రుడు సూక్ష్మరూపంతో జలకలశం తొండంలో అడ్డుపడి జలధార పడకుండా చేశాడు.

వామనుడు దర్భపుడక తీసి దాంతో తొండంలోకి పొడిచాడు. శుక్రుడు కన్నుపోయి ఒంటికన్ను వాడయ్యాడు. అడ్డు తొలగి జలధార బలిచక్రవర్తి చేతిమీదుగా వామనుడి దోసిటపడ్డది. దాననిధి పూర్తి కాగానే, ''ఇహ నీ అడుగులతో మూడు అడుగులు నేల కొలిచి తీసుకోవడమే తరవాయి!'' అన్నాడు బలి.

వామనుడు అమాంతంగా అలా అలా పెరిగి విశ్వరూపం ధరించి పొడవు, వెడల్పు, ఎత్తులతో క్రింద, మధ్య, మీద అనే మూడింటినీ ఆక్రమించాడు. ఒక పాదంతో భూమి నంతటినీ కొలిచాడు. త్రివిక్రముడైన విష్ణువు పాదం నీడలో భూతలమంతా క్షణకాలం పాటుగా గాఢాంధకారం క్రమ్ముకొన్నది. ఆ తరువాత ఆకాశాన్నంతటినీ కొలిచాడు. సూర్యచంద్రాది గ్రహాలు, నక్షత్రమండలాలన్నీ అతని పాదానికి అంటుకొన్న రేణువులుగా కనిపించాయి. అప్పుడు బ్రహ్మ తన కమండలంలోని జలంతో విష్ణుపాదాన్ని అభిషేకించాడు. విష్ణుపాదం నుంచి జారిన నీరు ఆకాశగంగగా స్వర్గసీమలో మందాకినిగా ప్రవహించింది.


54 చందమామ

''బలిచక్రవర్తీ! మూడో అడుగు ఎక్కడ వెయ్యమంటావు ?'' అని త్రివిక్రముడు అడిగాడు.

బలిచక్రవర్తి, ''ఓ త్రివిక్రమా! ఇదిగో నా శిరస్సు, దీనిపై మోపు!'' అని తల వంచాడు.

విష్ణువు విశ్వరూపాన్ని చాలించి యథా ప్రకారంగా వామనుడై అతని తలపై పాదాన్ని వేసి, ''బలీ! భూమ్యాకాశాల్ని సంపూర్ణంగా కొలుచుకొన్న నా పాదం నీ తలను పూర్తిగా కొలవలేక పోతున్నది సుమీ!'' అన్నాడు.

అప్పుడు ప్రహ్లాదుడు వచ్చి, ''నా మనుమడు బలి నీకు శత్రువు కాడు, అతణ్ణి అనుగ్రహించు!'' అని వామనుణ్ణి వేడుకున్నాడు.

బలిచక్రవర్తి భార్య వింధ్యావళి, చేతులు జోడించి నమస్కరించి ''వామనావరా! నా భర్తకు ఎటువంటి హానీ జరక్కుండా అనుగ్రహించడం నీకు ఉచితం!'' అని భక్తితో ప్రార్థించింది.

వామనుడు, ''అమ్మా! నీ భర్తకు హాని తలపెట్టడం ఎవ్వరికీ ఎప్పుడూ శక్యం కాని పని. అందువల్లనేకదా యాచకుడినై నేవచ్చి దానం పుచ్చుకున్నాను! అతని ధర్మబలం అలాంటిది!'' అని చెపుతూ ప్రహ్లాదుడి వంకచూసి, ''బలి నాకు ఎంత ప్రియతముడో తెలుసా ?'' అని అంటూ వామనుడు విష్ణుకళతో విరాజిల్లుతూ పొడవైన వేత్రదండాన్ని పట్టుకుని కనిపించాడు.

''ఓ బలిచక్రవర్తీ! నీ సాటి ఇదివరకు లేడు, ఇకముందు ఉండబోడు. ఆదర్శ పాలకులైన చక్రవర్తులలో నీ పేరే మొదటిది. నిన్ను సుతలానికి పంపుతున్నాను. పాతాళలోకాలకు అధిపతిగా శాంతిసుఖాలతో చిరంజీవిగా వుంటావు. నీ భార్య, నీ తాత ప్రహ్లాదుడు నీతోనే వుంటారు. నీ సుతల ద్వారాన్ని, నేనిప్పుడు కనబడుతున్నట్లే దండపాణినై కాపాలాకాస్తూ, నీకు రక్షగా ఉంటాను,'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.





# మూడు సందేహాలు

**ఒ**కానొక రాజుకు ఒక ఆలోచన వచ్చింది. ఏ పని ఎప్పుడారంభించాలి? ఎవరి సలహా తీసుకోవాలి? అనుసరించదగిన ఉత్తమ ధర్మమేమిటి?

ఆయన ఈ మూడు సందేహాలు తీర్చిన వారికి గొప్ప బహుమతులిస్తానని రాజ్యమంతటా దండోరా వేయించాడు.

దండోరా విని చాలామంది జ్ఞానులు రాజు వద్దకు వచ్చారు. ఏ పనిగాని ఎప్పుడు మొదలుపెట్టాలి అన్న ప్రశ్నకు కొందరు పంచాంగం చూస్తే తెలుస్తుందనీ, మరి కొందరు ఆరంభించే పనినిబట్టి యోగాలు మారుతాయనీ, ఇంకా కొందరు అవసరాన్నిబట్టి పనులు ముందు వెనకలుగా చేసుకోవాలనీ, రకరకాలుగా ఎవరికి తోచినట్టు వారు చెప్పారు.

ఎవరిసలహాలు తీసుకోవాలన్న ప్రశ్నకు, కొందరు మంత్రుల సలహా తీసుకోవాలన్నారు, మరికొందరు పండితుల సలహా తీసుకోమన్నారు, ఇంకా కొందరు సామంతుల సలహా తీసుకోమన్నారు.

ఉత్తమ ధర్మమేది అన్న ప్రశ్నకు, కొందరు శాస్త్రజ్ఞానం సంపాదించటమన్నారు, మరికొందరు వ్రతాలూ, ధర్మాలూ చెయ్యటమన్నారు, ఇంకా కొందరు యుద్ధం చెయ్యటమన్నారు.

ఇందరూ యిన్ని విధాలుగా చెబుతూంటే రాజుకు ఒక్కరి సమాధానమూ నచ్చలేదు. రాజధాని సమీపంలో వుండే వనంలో ఒక మహర్షి వుంటున్నాడు. తను ఆయన దగ్గరకు వెళ్ళి, తన సందేహాలు తెలిపి, సమాధానాలు తెలుసుకుందామనుకున్నాడు రాజు.

అయితే ఆ మహర్షి తన ఆశ్రమం దాటి రాడు, ఆశ్రమంలోకి సామాన్యులను తప్ప రానివ్వడు. అందుచేత రాజు సామాన్యుడి

రష్యన్ కథ



దుస్తులు ధరించి కొద్ది పరివారాన్ని వెంట బెట్టుకుని గుర్రం మీద ఆశ్రమం కేసి వెళ్లాడు. ఆశ్రమం వెలపలనే ఆయన గుర్రం దిగి, తానొక్కడూ మహర్షి పర్ణశాల వేపు వెళ్లాడు.

మహర్షి పర్ణశాల ముందుగల తోటలో మొక్కలకు మడులు తవ్వుతున్నాడు. ఆయన రాజు చేసిన నమస్కారం స్వీకరించి మళ్ళీ యథాప్రకారం తవ్వటంలో నిమగ్నుడయాడు.

రాజు ఆయనతో, "స్వామీ, నేను తమరి నడిగి మూడు సందేహాలకు సమాధానాలు తెలుసుకోగోరి వచ్చాను. ఏ పని గాని ఎప్పుడారంభించాలి? ఎవరెవరి సలహాలు స్వీకరించాలి? ఆచరించదగిన ఉత్తమ ధర్మం ఏది?" అని అడిగాడు.

తవ్వటం ఆపి రాజు మాటలు విన్న మహర్షి సమాధానం చెప్పకుండానే మళ్ళీ తన పని ప్రారంభించాడు. రాజు ఆయనతో, "తాము విశ్రాంతి తీసుకోండి. నేను తవ్వి పెడతాను," అన్నాడు. గునపాన్ని రాజుకిచ్చి మహర్షి నేల మీద చతికిలబడ్డాడు.

రాజు నాలుగు పాదులు తవ్వి మహర్షిని మళ్లీ వెనకటిలాగే తన సందేహాలడిగాడు. కాని మహర్షి సమాధాన మివ్వటానికి బదులుగా లేచి రాజు చేతిలో వున్న గునపం తీసుకోబోయినాడు. అయితే రాజు గునపం యివ్వలేదు. సూర్యాస్తమయం దాకా రాజే పాదులు తవ్వాడు. పని పూర్తి అయింది. రాజు గునపాన్ని కింద పెట్టి, "స్వామీ మీరు చాలా జ్ఞానులనీ, నా సందేహాలు తీరుస్తారనీ వచ్చాను. వాటికి సమాధానాలు మీకు తెలియని పక్షాన చెప్పెయ్యండి, నేను నా దారిన పోతాను!" అన్నాడు.

"ఎవరో వస్తున్నట్టున్నది. విశేషమేమిటో తెలుసుకుందాం!" అన్నాడు మహర్షి. రాజు వెనక్కు తిరిగి చూసేసరికి వనం నుంచి ఆశ్రమంలోకి వస్తూ ఒక వ్యక్తి కనిపించాడు. అతను చేతిలో తన



పొట్ట నొక్కిపట్టుకుని వున్నాడు. అతని వేళ్ళ సందు నుంచి రక్తం బయటికి వస్తున్నది. అతను రాజు దాకా వచ్చి మూలుగుతూ స్పృహతప్పి పడిపోయాడు. రాజూ, మహర్షీ కలిసి ఆ మనిషి దుస్తులు విప్పి చూసేసరికి అతని పొట్టలో పెద్ద గాయం వుంది. రాజు ఆ గాయాన్ని చాలా సేపు కడిగినాక రక్తం కట్టింది. తరవాత ఆ మనిషికి స్పృహవచ్చి తాగటానికేమైనా యివ్వమని అడిగాడు. రాజు కుటీరంలో నుంచి మంచినీళ్ళు తెచ్చి అతనిచేత తాగించాడు.

ఇంతలో చీకటి పడింది. రాజూ, మహర్షీ కలిసి గాయపడినవాణ్ణి కుటీరం లోకి చేర్చారు. రాజు మండిగానికి తలచేర్చి తెల్లవార్లూ గాఢ నిద్రపోయి, తెల్లవారి లేచాడు.

రాజు నిద్రలేచినట్టు గ్రహించి, ఆ మనిషి, మంచం దిగివచ్చి, "మహారాజా, నన్ను క్షమించండి!" అన్నాడు.

"నువ్వెవరో నే నెరగను. నిన్నెందుకు క్షమించటం?" అని అడిగాడు రాజు.

"మీరు నన్నెరగరు గాని, నేను మిమ్మల్ని ఎరుగుదును. మీరు ఒకప్పుడు నా అన్నను ఉరితీయించి, అతని ఆస్తి స్వాధీనపరచుకున్నారు. మిమ్మల్ని చంపి పగ తీర్చుకుంటానని అప్పుడు నేను శపథంచేసి మీ మీద కక్ష కట్టాను. మీ శత్రువును. మీరు మహర్షిని చూడ వెళ్ళారని తెలిసి, ఆశ్రమం నుంచి తిరిగి వచ్చేటప్పుడు చంపుదామని ఒక పొదలో దాగాను. కాని మీరెంతకూ రాలేదు. అందుచేత మాటునుండి బయటికి వచ్చి మీ కోసం బయలుదేరాను. ఇంతలో మీ అంగరక్షకులు నన్ను చూసి, గుర్తించి గాయపరిచారు. నే నెలాగో వారి బారినుంచి తప్పించుకున్నాను. కాని మీరు నా గాయాన్ని కడిగి రక్తం కట్టించకపోతే రక్తస్రావంతో చనిపోయి వుండేవాణ్ణి. నేను మిమ్మల్ని చంపాలనుకుంటే, మీరు నా ప్రాణం రక్షించారు. మీరు నన్ను బతక

నిచ్చే పక్షాన నేనూ, నా కొడుకులూ మీకు యావజ్జీవం భృత్యులుగా ఉండగలం!'' అన్నాడా మనిషి.

ఇంత సులువుగా తన శత్రువుతో రాజీ కుదిరినందుకు రాజు చాలా సంతోషించాడు. ఆ మనిషికి రాజవైద్యుడి చేత చికిత్స చేయిస్తాననీ, అతని అన్న తాలూకు ఆస్తి అతనిపరం చేస్తాననీ రాజు అతనికి మాట ఇచ్చాడు.

రాజు కుటీరంలో నుంచి బయటికి వచ్చేసరికి మహర్షి పాదులు పెడుతూ కనిపించాడు. రాజాయనను సమీపించి నమస్కరించి, ''స్వామీ, నా సందేహాలు తీర్చారు కారు,'' అన్నాడు.

మహర్షి నవ్వి, ''నీ సందేహాలన్నీ తీరేపోయాయి. అర్థం కాలేదా? నిన్న నువు నా బలహీనత చూసి జాలిపడి మడి తవ్వుతూ ఉండిపోయావుగాని, వెళ్లిపోతే నిన్నా మనిషి చంపేవాడే. కనుక ఆ సందర్భంలో ప్రధానమైనవేళ నువు మడి తవ్వినది. నీకు ప్రధానమైన వ్యక్తిని నేను. నాకు సహాయపడటమే నీ ప్రధాన ధర్మమయింది. తరవాత ఆ మనిషి పరిగెత్తుకుంటూ వచ్చినప్పుడు నీకు ప్రధానమైన వేళ నువ్వతనికి సేవ చేసినది. ప్రధానమైన వ్యక్తి అతను. అతనికి సహాయపడటం నీ ప్రధాన ధర్మమయింది. జ్ఞాపకం ఉంచుకో; ప్రధానకాలం-ఇప్పుడే! ఎందుకంటే ఆ క్షణంలోనే మనకు శక్తి ఆధీనంలో ఉండేది. ఆ క్షణం తర్వాత ఏం జరుగనున్నదో మనకు తెలీదు. ఇక పోతే, నీకు ప్రధానమైన వ్యక్తి నీ వెంబడి ఉన్నవాడు! ఎందుకంటే మనకు మరొకడితో ప్రమేయం ఉండబోయేదీ, లేనిదీ అప్పట్లో ఎవరూ చెప్పలేరు. ఇక ప్రధాన ధర్మం ఏమంటే వాడికి సాయపడటం! ఎందుకంటే దానికోసమే మానవజన్మ ఎత్తాం!'' అన్నాడు.

రాజు ఈ సమాధానాలకు పరమానందం చెందాడు. ఆయన మహర్షికి నమస్కరించి తన భవనానికి వెళ్ళిపోయాడు.



# వైద్యుడి శ్రమ

వైద్యంలో అపరధన్వంతరి లాంటివాడని పేరుమోసిన నారాయణాచారికి, ఒకనాటి అర్ధరాత్రి వేళ, కోసుదూరంలో వున్న కమలాపురం జమీందారు నుంచి కబురు వచ్చింది. ఆయన తండ్రి గారికి బాగా జబ్బు చేసింది. వెంటనే బయలుదేరి రావాలి.

ఈ కబురు తెచ్చిన జమీందారు నౌకరుతో నారాయణాచారి, "అర్ధరాత్రి, చలి, పొగ మంచు—అయినా తప్పదు, పద! బండెక్కడ?" అన్నాడు.

"అయ్యవారు అదుర్దాలో వుండి, ఆ మాట మరిచారు. మనం నడిచిపోవలసిందే!" అన్నాడు జమీందారు నౌకరు.

నారాయణాచారి అప్పటికప్పుడు ఒక ఒంటెద్దుబండి కట్టించుకుని కమలాపురం బయలు దేరాడు. దారిలో బండిచక్రం విరిగింది. అంత చీకటి, చలిలో ఆయన నానా శ్రమపడి కాలి నడకన జమీందారిల్లు చేరాడు. తీరాచూస్తే జమీందారు తండ్రికి ప్రమాదం ఏమీలేదు, కొంత స్వస్థతగానే వున్నాడు. నారాయణాచారి జమీందారుతో, "వెంటనే మీ బంధువులందరినీ క్షణాల మీద పిలిపించండి," అన్నాడు.

ఎంతో ప్రమాదం అయితేతప్ప, నారాయణాచారి అలా చెప్పడని జమీందారు బళ్ళూ, మేనాలూ, పల్లకీలూ పంపి, చుట్టుపక్కల గ్రామాల్లో వున్న బంధువులందర్నీ పిలిపించాడు.

నారాయణాచారి, జమీందారుకు ఒక మందుపొట్లం యిచ్చి, వాకిట్లో వున్న ఒక పల్లకి ఎక్కి కూర్చున్నాడు. తన తండ్రికి అంత ప్రమాదంగా వుంటే, వైద్యుడు ఎందుకు బయలుదేరి పోతున్నాడో అర్థం కాక, జమీందారు నారాయణాచారిని, "మా నాన్నగారికి ఏం ప్రమాదం లేదా?" అని అడిగాడు.

"అలాంటిదేమైనా వుంటే, నేనెందుకు వెళతాను? ఈ అర్ధరాత్రివేళ నేనిక్కడికి రావడానికి ఎంత శ్రమపడ్డానో తెలిసేందుకు, మీ బంధుమిత్రులందర్నీ పిలిపించాను," అన్నాడు నారాయణాచారి.

—ఎం. డి. సౌజన్య



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును







Chandrapal Singh — Chandrapal Singh

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవి చేర్చరాదు) ఈ అడ్రసుకు పంపాలి : – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వరుగు పందెం

రెండవ ఫోటో : చెలిమి అందం

పంపినవారు : జి. గోపాలకృష్ణ, తూత్తుక్కుడి (తమిళనాడు)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# ఉచితం




## ఒక క్యాడ్‌బరిస్ జెమ్స్ ప్యాక్
## బోర్న్‌విటా యొక్క 500గ్రా. ప్యాక్‌తోబాటు

ప్రత్యేకమైన కానుక! ప్రత్యేకమైన లేబుల్‌గల 500 గ్రా. బోర్న్‌విటా డబ్బా లేదా రీఫిల్ ప్యాక్ అడిగి తీసుకోండి! దీనిలోపల ఉండే క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఉచిత ప్యాక్ పొందండి.




త్వరపడండి! సరుకు ఉన్నంతవరకే ఈ కానుక పరిమితం!

క్యాడ్‌బరిస్

# బోర్న్‌విటా

దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక

OBM/1083/TL